# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

### సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 1-10-1979 సంచికలు 22, 23


—* ఈ సంచికలో *—





16—10—79 సంచికలో త్యాగరాజస్వామి, కవి ఇఖ్బాల్, తెలుగువారు సంస్కృత భాషాసేవ, జానపద విజ్ఞానము - తెలుగు జానపద సాహిత్యము మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 2 రాజమహేంద్రవరము 1-10-1979 సంచికలు 22, 23

# కావ్యహేతువులు

— విద్వాన్ చక్రవర్తుల రామానుజాచార్యులు, ఎం. ఏ.

మన ప్రాచీన ఆలంకారికులు, పాశ్చాత్యవిమర్శకులను కవిత్వం జన్మసిద్ధమని (నైసర్గికమని) అంగీకరించారు. అయితే ఒక్కొక్కనిలో ఒక కమనీయ విషయాన్ని విన్నపుడుగాని, ఒక రమణీయ దృశ్యాన్ని చూచినపుడుగాని ఆనంద పరవశత్వం కలుగుతుంది. ఇది కవిత్వోత్పత్తికి ప్రథమకారణం మొదటిఅర్హత.

'దండి' తన 'కావ్యాదర్శము' లోను, 'మమ్మటుడు' తన 'కావ్యప్రకాశము' లోను ఈకావ్యహేతువుల్ని పేర్కొనడం జరిగింది. అవి శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసములు. వీనికే వరుసగా ప్రతిభ, నిపుణత, శిక్ష అను పేర్లు కూడా గలవు. ఈ మూడింటినీ కలిపి ఒక్క హేతువుగనే పేర్కొన్నవారును లేకపోలేదు.

పైమూడింటిలో మొదటిదైన 'ప్రతిభ' నిసర్గమైంది. అది ఒకడుపాటుపడి సంపాదించ తగింది కాదు ఒక వస్తువు నందు (object) ఉన్నట్టి అనంతత్వమును ఆనందమయత్వమును చూడ గలుగు లక్షణమే శక్తి అందువల్లనే 'కవయః క్రాంత దర్శినః' అని అనుట ఆ క్రాంతి దర్శిత్వమే దివ్యదర్శనము (vision devine) అభినవ గుప్తుడు అనే ఆలంకారికుడు 'అపూర్వవస్తు నిర్మాణ క్షమాప్రజ్ఞా' అనినాడు. ఈ అభిప్రాయాన్నే భామహుడు తనమాటల్లో 'నవనవోన్మేషశాలిని అయిన ప్రజ్ఞయే ప్రతిభ' అని వక్కాణించాడు. అయితే ఒక అపూర్వ వస్తువును చూడడం వల్ల ప్రతి ఒక్కరికో ఆనంద తన్మయత్వం కలుగవచ్చు. ఆతన్మయత్వం క్రమంగా కావ్యనిర్మాణ క్షమంకావాలి అలా జరిగినపుడే అది కావ్యహేతువు అవుతుంది. అపూర్వ వస్తు సందర్శనం వల్ల తన హృదయంలో కల్గిన ఆనందానుభూతిని ఆవిష్కరింప గల్గిన వాడే కవి అవుతాడు దీనివల్ల 'శక్తి' అనే కావ్యహేతువు తొలుత అపూర్వ వస్తుసౌందర్య ప్రదర్శనాన్ని చేస్తూవుంది.

'రాజశేఖరుడు' తన 'కావ్యమీమాంస'లో ఈశక్తినే 'భావయిత్రి, కారయిత్రి' అని రెండుగా విభజన చేశాడు కవిచేత భావింప జేసేది భావయిత్రి. అతనిచే కావ్యనిర్మాణ క్రియను నిర్వహింపజేసేది కారయిత్రి. ఒక్కొక్కప్పుడు ఈ రెండుపనులు అవ్యవహితంగాను జరుగవచ్చు. కాని ఆ విధంగా జరిగే కావ్యనిర్మాణం అత్యల్ప పరిమాణాన్ని కలిగి వుంటుంది. కవిత్వజగత్తుకు తొలిపలుకులయిన 'మానిషాద ప్రతిష్ఠాంత్వం .' అని వాల్మీకి నోటినుండి వెడలిన శాపవాక్యం ఇట్టిదే. ఇట్టి భావముతో ఒక కావ్యాన్ని నిర్మించవలెనన్న ఆ భావవేగము శమించుటకు కొంత వ్యవధి అవసరము. కవి హృదయంలో కల్గిన రాయణీయకతను అది కావ్యరూపము దాల్చు లోపల ఎగిరిపోకుండా మనః పంజరస్థముచేసి పోషించుకొనుచుండవలెను. "Emotions recollected in tranquility" Words Worth.

రాజశేఖరుడు మాత్రము కవికి ఏకాగ్రత అవసర మనినాడు. 'Clive Bell' అనే పాశ్చాత్య విమర్శకుడు 'రసవంతమైన కావ్యము కవి భావుకత్వమునకు నిదర్శనము. రసవిహీనతకు కారణం అతని భావుకతా లోపమే' అన్నాడు.

మానవుని అంతః ప్రకృతిలోనున్న హృదయ కోశము, మనఃకోశము అను నవి కవితా ప్రవృత్తికి ఆధారభూతాలు. మానవునికి ఒక దృశ్యమును చూచినపుడు కలిగే సుఖదుఃఖాది మానసిక విక్రియకే వేదన (feeling) అని పేరు అపుడు హృదయానికి కలిగే ఆవేశమే భావావేశము (Emotion) హృదయ జన్యమైన ఈ భావావేశము మనఃకోశాన్ని చేరి భావన Imagination) అవుతుంది. ఈ భావము,

భావన (Emotion and imagination) రెండును కలిసి భావుకత్వ మగుచున్నది

కావ్యహేతువులలో రెండవది 'వ్యుత్పత్తి', దీనికే నిపుణత అనిపేరు ఇది పాండిత్యము వలన సిద్ధించును. కవిత్వము శబ్దచిత్రణ గలది. దీనికి రసాలంకార సాంకేతిక పరిజ్ఞానమును, ఛందో వ్యాకరణాది గుణాగుణ విచారణా సామర్థ్యమూ అవసరము. శాస్త్రపరిజ్ఞానంతో పాటు లోకవృత్త పరిజ్ఞానము, ఉచితానుచిత వివేచనాశక్తి, చిత్తసంస్కారము, ఇతర కళాపరిచయము కూడా అవసరము.

ఈదా తిక్కన లౌకిక జ్ఞానము చక్కగా తెలిసినవాడు లోకతంత్రము నడుప సమర్థుడు. అందువల్ల అతని రచన లోకవ్యవహారమునకు అత్యంత సన్నిహితంగా వుంది ఇట్లే రామరాజ భూషణుడు సంగీత కళారహస్యనిధి. అందువల్లనే అతని కవిత్వం సంగీత సాహిత్యముల సంగమ స్థానంగా నిల్చింది.'Good heart Rendell' అను పాశ్చాత్య విమర్శకుడు_ 'ఏకకళయైనను వికసించి ఫలించవలెనన్న దానిని అన్యకళా సామాన్య పరిజ్ఞాన మనెడి క్షేత్రమున నాటవలె' నని తెల్పినాడు. కాబట్టి కవికి మౌలిక మయిన ప్రతిభతో పాటు వ్యుత్పత్తిలో పేర్కొనిన అన్ని లక్షణాలు కూడా అవసరమే.

మూడవ కావ్యహేతువు అభ్యాసము. ఇది శైలికి వన్నెపెట్టును. ప్రజ్ఞకు దార్ఢ్యమును కల్గించును. రచనకు ప్రజ్ఞా నిశితత్వము కల్గును. శైలీ ప్రజ్ఞలమాట ఎట్లున్నప్పటికీ అభ్యాసము మానినచో నశించు ప్రమాదము కలదు. ఈ విషయాన్నే Moalton-

'You Can improve the fawlty by Practice or impair it by negligence'

అనినాడు. నిరంతర కృత్యవస్తుపరిశీలనమే అభ్యాస మని' రాజశేఖరుడు తెల్పెను. దండిచెప్పిన అమందాభియోగము నిరంత రాభ్యాసము వల్లను కల్గుతుంది.

ప్రతిభ లేని వ్యుత్పత్తి, అభ్యాసములు నిష్ఫలములనియు తక్కినవి రెండు ప్రతిభకు సంస్కారమును కల్గించును అని రాజశేఖరుడు తెల్పి, ప్రతిభయే గొప్పదనినాడు. వ్యుత్పత్తి హీనత యొక్క దోషమును ప్రతిభ కప్పిపుచ్చు నని నాడు. ఆనందవర్ధనుని అభిప్రాయంకూడ ఇదే వ్యుత్పత్తి అంటే కేవలం శాస్త్ర పాండిత్యమూ, శాబ్దిక పరిజ్ఞానమే కాక చిత్తసంస్కారమని కూడా భావించవలెను 'Winchester'అను పాశ్చాత్య విమర్శకుడు 'కవి గతం కాని గణం కావ్యగతము కాలే'దనినాడు. 'లోకో భిన్నరుచిః' అన్నట్లుగాక, అతడే కవిత్వానికి శాస్త్రీయమూ, ప్రామాణికమూ అయిన మార్గమును ఆలోచించెను. ఆతడు అన్నిరకము లయిన సాహిత్య ప్రక్రియలకు నాల్గుఅంశములు ప్రధానమనినాడు.అవి1) భావము(Emotion) 2) భావన (Imagination) 3) ఆలోచన (thought) 4) పదగుంభనము (form).

మన వారిలో క్షేమేంద్రుడు - 'అలంకారాస్త్వలం కారా, గుణా ఏవగుణాస్సదా, ఔచిత్యం రససిద్ధస్య, స్థిరం కావ్యస్యజీవితం '

అని తెల్పెను. ఈమాటలును కావ్యసంపదనే తెల్పుచున్నవి.

ఆనందవర్ధనుడు 'అనౌచిత్యాదృతేనాన్య ద్రస భంగస్య కారణమ్' అనెను కావ్యమున అనౌచిత్యము కన్నవేరు రసభంగములేదు. అనౌచిత్యమన్నది రసము, గుణము, శిల్ప మర్యాదలకు సంబంధించినది. అనౌచిత్యమును తొలగించుటకు కవిలో సమరస భావము అవసరము అదియే సంయమనము ఆంగ్ల విమర్శకులు దీనినే-'The balance of the emotional and intellctual elements in Poetry' అనిరి. మన ఉపనిషత్తులలో కూడా సంయమనము బుద్ధిసంబంధించినది అనియున్నది ఒక మహాశ్వేత 'Poetry is not expressing emotion but withstanding it' అని అనెను (కవిత్వ మనగా భావావేశ వ్యక్తీకరణము కాదు భావావేశ నిగ్రహము) ఇక్కడ నిగ్రహ మనగా సంయమన ముతో కూడిన వ్యక్తీకరణ మని యర్థము. పైవిధంగా కవితా సృష్టికి రజోగుణము, మర్యాదా పరిపాలనమునకు సత్త్వగుణమును, కారణములగుచున్నవి

స్థూలముగ కావ్యగుణములను మూడు వర్గములు చేసిరి. 1) బుద్ధిగమ్యము (intellectual) 2) భావస్ఫోరకము (emotional) 3) శ్రవణపేయము (aesthetic) అనునవి. 'శైలి' (style) అనునది కవి ఆత్మధర్మమునకు సంబంధించినది. అర్థమునకు మించినశబ్దభారముకాని, శబ్దమునకు మించి అర్థభారముకాని లేక, రెండును సరిగానున్నదే ఉత్తమ రచన. ఈ అభిప్రాయాన్నే 'Walter peter' 'That is the best piece of art in which the distinction between matter and manner is minimised' అని వక్కాణించెను.

కావ్య పఠన వేళ మనకు భావనాత్మక నిర్వృతిని (imaginative pleasure) కల్గించునదే ఉత్తమ రచన పాశ్చాత్యులు ఆనంద సిద్ధి కవిత్వ పరమావధి అనగా, మనప్రాచీనులు ఆనంద సిద్ధితోపాటు సగుపదేశమును నిర్దేశించిరి మొత్తముపై శ్రవణ పేయమ్మును, విశ్వశ్రేయస్సును కల్గించునది కావ్యమనుట సమంజసము

Bibliography
1 'సాహిత్య శిల్ప సమీక్ష'
- ఆచార్య పింగళి లక్ష్మీకాంతం.
2. 'సాహిత్య సోపానాలు'
- ఆచార్య దివాకర్ల వెంకటావధాని.

# మాలెప్రోప్రిజమ్ [Malapproprism]

— శ్రీ భమిడిపాటి అనంతశర్మ, ఎం ఏ

హాస్యము నవరసములలో ఒకటి. హాసముద్వారా మనసుకి ఆనందము తెచ్చే యత్నము కలిగించడం వలన హాస్యరసము సిద్ధిస్తుంది. నగనవ్వు (హాసము) ఎందువలన వస్తుంది? ఏ నం సర్వసాధారణంగా చూడడానికి - లేదా - వినడానికి అలవాటు పడినదానికి భిన్నంగా ప్రవర్తించడం వలనగాని మాట్లాడడం వలనగాని నవ్వు కలుగుతుంది. ఒక ఉదాహరణ వర్షం కురుస్తోంది. గొడుగు చేతిలో వుంటే అది విప్పి వేసుకుని వెళ్లడం సాధారణం. గొడుగు ముడిచి పట్టుకుని వెళ్లేవాడ్ని చూస్తే నవ్వొస్తుంది. ఆ పెద్దమనిషి దగ్గరికెళ్ళి 'అయ్యా! గొడుగు ముడిచి వర్షంలో తడుస్తున్నారెందు'కని అడిగితే 'అబ్బెబ్బె గొడుగు విప్పితే తడిసి పోతుంది' అన్న సమాధానానికి నవ్వొస్తుంది.

మన నాటకాలలో విదూషకుడి వేషధారణ - మాటలు - చేష్టలూ అన్నీ ప్రత్యేకంగానూ - వింతగానూ వుంటాయి. వేషంలో చేష్టలలో హాస్యం కంటె మాటలలో హాస్యం మెరుగు. మొదటి రెండూ లఘువైనవి. ఇది వెగటు. మాటలలో హాస్యం మళ్ళీ రకరకాలు. పగలబడి నవ్వించక పోయినా మనసుకి హాయి అనిపించే సున్నితమైన హాస్యం ఉదాత్తమైనది. 'రిపార్టీ' ఈరకంలోకి వస్తుంది. ఈ మాటల హాస్యంలో మళ్ళీ చవకబారు హాస్యం కోవకి వచ్చేది. ఈ 'మాలెప్రోప్రిజమ్' అన్నది.

ఒకమాటని వాడవలసినచోట - కొంచెం ఇంచుమించు అదే ఉచ్చారణ కలిగి వేరే అర్థం వచ్చేమాటని వాడడాన్నే 'మాలెప్రోప్రిజమ్' అంటారు. ఒక ఉదాహరణ 'ప్రస్తుత మంత్రివర్గంమీద 'No Conference motion' ప్రవేశపెట్టారు' అన్నారొకాయన. ఆయనభావం 'No confidence motion' అవిశ్వాస తీర్మానం అని. ఈ రకమైన అపశబ్ద ప్రయోగ రూపమైన శబ్దాశ్రయ హాస్యమే మాలెప్రోప్రిజమ్ అంటే.

R B SHERIDAN అనే ఆతను 'The Rivals' అనే నాటకం వ్రాశాడు. అందులో ఒక పాత్ర పేరు 'Mrs Malaprop' Appropriate అంటే ఉచితమైన లేక సరియైన అని అర్థం. ఈవిడ దానికి వ్యతిరేకంగనక Mrs Malaprop అని పేరుపెట్టెను. ఈపాత్రలక్షణం "she uses big words in a vain display of learning and fools herself' అని చెప్పేరు. ఈవిడ లక్షణాన్నే మాలెప్రోప్రిజమ్ నిర్వచనంగా చెప్పుకోవచ్చు.

ఆనాటకంలో ఈవిడ మాట్లాడిన కొన్ని ఆణిముత్యాలు.

i) 'Sir Anthony!, you are an absolute mis an thropy' ఈ వాక్యంలో 'mis-an thrope' అనవలసివుంది. అంటే మనిషిని ద్వేషించేవాడు.

ii) 'I woud have her instructed in geometry that she might know something of contagious contries

ఈ వాక్యంలో Geography అనవలసినచోట geometry అనీ, Contiguous అనవలసినచోట contagious అనీ అంది. contiguous అంటే ఇరుగుపొరుగు దేశాలు. contagious disease అంటే అంటు వ్యాధి.

iii) 'He is the very pineapple of politeness' pineapple అంటే అనాస పండు. ఈవిడ భావం He is the very pinnacle of politeness' అని అంటే సభ్యతలో అత్యున్నతస్థాయి - కలిగినవాడు.

కాని ఈవిధమైన ప్రయోగానికి ఇతడే మొదటివాడుకాడు. ఈ R B Sheridan కంటె ముందు మహాకవి షేక్స్పియర్ ఈ ప్రయోగం చేసివున్నాడు 'The Mid Summer-night's Dream' అనే నాటకంలో Bottom, Quince ల సంభాషణలలో ఈ ప్రయోగం కనిపిస్తుంది.

1) Act I Sc I Bottom వాళ్ళు ప్రదర్శించబోయే 'పిరమస్ అండ్ థిస్బీ' అనే నాటకం రిహార్సల్సు గురించి తన మిత్రులతో -

Them we mast rehearse most obscenely and courageously' అంటే మనం చాలా ఉద్ధృతంగా రిహార్సు చెయ్యాలి అని చెప్పదల్చుకుని 'obscenely' అనేమాటని అదనంగా చేర్చేడు. obscenely అంటే జుగుప్సాకరంగా అని చెప్పవచ్చు.

2) Act III Sc I అంతర్నాటకంలో పిరమస్ తనప్రియురాలు థిస్బీతో అన్న మాటలలో కూడా తన సహజ ధోరణిని మర్చిపోడు. పిరమస్ పాత్ర .

'Thisby, the flowers of odious sabours sweet'

3) Act IV Sc II లో క్విన్స్ అనేవాడు Bottom యొక్క గాత్రమును ప్రశంసిస్తూ -

'He is a Paramour for a sweet voice' అంటాడు.

అతడు చెప్పదలచుకొన్నది He is a paragan for a sweet voice

కాని ఈ విధమైన హాస్యానికి Malapproprism అన్న పేరు షెరిడన్ నాటకంలో Mrs Malaprop వల్లనే వచ్చింది.

తెలుగులో శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ 'కంఠాభరణం' నాటకంలో ఈరీతి హాస్యాన్ని చొప్పించారు. ఈ నాటకంలో 'సోమావధాని' పాత్రని మనం Mr Malaprop గా అనుకోవచ్చు. ఈయనని 'అపశబ్ద శాసనుడు' అన్నారు వెంకటశాస్త్రి అని ఇంకొక పాత్ర ఈతని అపశబ్దాలని ఎప్పటికప్పుడు సరిదిద్దుతూంటాడు సోమావధానిగారి సంభాషణలలో కొన్ని ...

సోమ నాఘుట ముండగా నట్టి యకార్య ఖననము జరుగకూడదు.

వెంక అకార్య కరణమని శలవిచ్చెదరు గాక!

సోమ మాలోచిన్న పెద్ద తాత్పర్యములు లేవు.

వెంక చిన్న పెద్ద తారతమ్యములని శలవిచ్చుచున్నారు కాబోలు.

సోమ మాయింటి దానికి మాంగల్య వ్యచ్ఛత్తి లేదని మాతండ్రిగారు శలవిచ్చినారు.

వెంక మాంగల్య విచ్ఛిత్తియని కాబోలు మీ యభిప్రాయము.

సోము మావియ్యంకులు దిగ్గంతుల వంటి పండితులు.

వెంక దిగ్దంతు లనవయ్యా.

ఒక పాత్రయొక్క చవకబారుతనాన్ని అల్పత్వాన్ని ప్రదర్శించడానికి ఈరకమైన హాస్యం ప్రయోగింపబడుతోంది. అపాత్ర అపహాస్యం పాలవుతుంది. మనకు హాస్యం అందుతుంది. ఇటీవలి నాటకాల్లోనూ, సినిమాల్లోనూ కూడ ఈప్రయోగాలు చాలా వున్నాయి.

'కథానాయకుడికథ' చిత్రంలో అల్లు రామలింగయ్య పాత్ర.

'మీరే నా విగ్రహాన్ని బహిష్కరించాలి. [ఆవిష్కరించాలి అని వారి భావం]

'కనకయ్య కాపురం' 'పలుకే బంగారమాయె' మొదలైన ఆధునిక సాంఘిక నాటకాలలో కూడా ఇలాంటి పాత్రలున్నాయి.

చివరగా మరొక ఉదాహరణ:

ఒక సభజరిగింది. ప్రధాన అతిథి చాలా చక్కగా మాట్లాడారు. తమ చమత్కారాలతో శ్రోతలని కడుపుబ్బ నవ్వించారు. సభాకార్యక్రమంలో చివరి అంశం కార్యదర్శి కృతజ్ఞతా నివేదికలో– 'మనం ఆహ్వానించినంతనే–మనమీద అభిమానంతో తమకు ఎన్ని పనులున్నప్పటికి–వాటిని పక్కనపెట్టి మనసభకి వచ్చి చాలా హాస్యాస్పదంగా ప్రసంగించిన ' తరవాత వినబడలేదు ప్రేక్షకుల నవ్వులలో.

ఈవిధమైన హాస్యం మన నిత్యజీవితంలో కూడా చాలామంచి మిత్రుల ద్వారా వింటూంటాం అది సాధారణంగా పొరపాటున జరుగుతూంటుంది.

— · —

# విశ్వనాదవారి అద్భుత సృష్టి "కడిమిచెట్టు"

— శ్రీమతి శిరీష, ఎం. ఏ.

తేనెలూరు తెనుగు భాషలో చరిత్రాత్మక-నవలలను ప్రతిభావంతముగా వ్రాయగల కవులను వేళ్ళమీద లెక్కించవచ్చు వారిలో రాహుల్ సాంకృత్యాయన్ వలె ప్రత్యేకశ్రద్ధతో చ తాత్మక కావ్యాలను వ్రాసిన మహామనీషి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. ఆయన కలంనుండి వెలువడిన అపూర్వ కావ్యం 'కడిమిచెట్టు'

మామూలు నవలలను వ్రాయడం కన్నా చారిత్రక-నవలలను వ్రాయడం కష్టతరం. అటుచారిత్రక విషయాలకు భంగం వాటిల్లకుండా ఇటు పాఠకుని ఉత్కంఠకు భంగంరాకుండా రచన చేయవలసిన బాధ్యత చారిత్రక-నవలా రచయిత భుజస్కంధాలపై ఉన్నది. ఆరెండు బాధ్యతలను అత్యంత దిగ్విజయంగా నిర్వహించిన అత్యంత ప్రతిభాశాలి శ్రీ విశ్వనాథ. కడిమిచెట్టు నవల వస్తు నిర్మాణంలోనూ, కథాబంధనలలోనూ, చారిత్రకాంశ వివరణలోనూ, ఉత్కంఠ పోషణలోనూ, పాత్ర సృష్టిలోనూ, కథఎత్తుగడ, ముగింపులలోనూ ఏకోణంనుండి చూసినా అత్యున్నత శిఖరాల నందిన ప్రఖ్యాత గ్రంథరాజము

'ఈకథ స్వతంత్రతాకథ. ఈకథయూ స్వతంత్రతా మనీషాకథయే' అని చెప్పారు. కృతక వచనరచన లేకుండా మనం మాట్లాడుకొన్నట్లే ఉండే వచన భాషను శబ్దం చ్యుత సంస్కారం కాకుండా ఉండునట్లుగా ఈప్రయత్నం చేస్తున్నానని రచయిత చెప్పుకున్నారు. ఆప్రయత్నంలో కృతార్థు లయ్యారనుటకు 'కడిమిచెట్టు' లోని ప్రతి మాట ప్రత్యక్షనిదర్శనమే కథ దినదినమూ శుక్లపక్ష చంద్రునివలె పెరుగుతున్న కడిమిచెట్టుతో ప్రారంభమై కవి పూజ అందుకోవడంతో ముగుస్తుంది మృచ్ఛకటికంలో ఆటబాడిలాగా ఇందులో కీలకస్థానాన్ని ఆక్రమించుకొని సార్థక నామధేయాన్ని పొందింది 'కడిమిచెట్టు'

ఇది చారిత్రకనవల. ఎత్తుకు పైఎత్తులను వేసినది మయూరశర్మ అనడం కంటే విశ్వనాథవారే వేయించారనడం సమంజసం ఎత్తుకు పైఎత్తులతో నవల పాఠకుడిని ఊపిరిబిగబట్టి ఏకబిగిని చదివేలా చేస్తుంది సాధారణంగా చారిత్రక కథావస్తువులో పాత్రల మనోవిశ్లేషణకు అవకాశం ఉండదు. కాని విశ్వనాథ ఆనాటి

చమత్కారం కడుచమత్కారంగా చేశారు

పల్లవరాజు శివస్కంధవర్మ దళవాయి భల్లాతకవర్మ కడుక్రూరుడు. అతడు చూసిన కట్టిచూపే మయూరుని మనసుమీద ఫెడేలున దెబ్బ కొట్టినట్లయింది. చిన్ననాడు కడిమిచెట్టుకింద అతని తండ్రి తాతలను వధించి, కటుంబాన్ని నాశనం చేసిన వానిపై పగతీర్చుకొన యత్నించే మయూరుడు భల్లాతుని క్రౌర్యమును చూపు వలననే కనుగొన్నాడు. భల్లాతునిపై అభియోగం చేయబూనాడు. అందరూ హేళనచేశారు. వీరవర్మ కొరడాతో మొహంమీద కొట్టి వెళ్ళిపోయాడు. అభియోగం పల్లవరాజు వరకూ చేరే యోగంలేక పోయింది. ఫలితంగా మయూరవర్మ స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరచి, భల్లాతుని అదే కడిమిచెట్టు క్రింద వధించి పగ తీర్చుకొంటాడు.

'కడిమిచెట్టు' లోని రాజకీయాలు విశ్వనాథ వారి వ్యక్తిత్వదర్పణంలో రెండు విధాలుగా గోచరిస్తాయి. 1. ఆంధ్ర దేశాభిమానం, 2. ప్రజాస్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై ప్రేమ.

సముద్రగుప్తుడు ఆంధ్రదేశంపై దండెత్తాడు. అతని దండయాత్ర వెనుదిరిగి పోయింది. వ్యూహనిర్మాణంలో యుద్ధానికి తగిన స్థలాలను వెదుకటలో ఆంధ్రుల నేర్పు అతనిని ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఆనాటివఱకు ఔత్తరాహులకు దాక్షిణాత్యులన్నచో పరిహాసంగా ఉండేది. అది ఆంధ్రుల దెబ్బతో వమ్మైపోయింది.

ఇక ప్రజారాజ్యంపైనే విశ్వనాథ వారికి మక్కువ ఎక్కువ అనే విషయాన్ని ఈ నవల ఋజువుచేస్తుంది. మయూరుని పదాతిసైన్యం 4 లక్షలట. శాతవాహన రాష్ట్రప్రజలందరూ అతని సైనికులే! అలా నాలుగు నెలలలో మలచినాడు మయూరుడు. స్త్రీలు అవసరమువస్తే అన్నిరంగాల్లో ముందంజ వేయాలనే భావం విశ్వనాథకు ఉన్నది. అంతేకాదు! స్వాతంత్ర్యేచ్ఛకల దేశాన్ని ఏ ఇతరరాజు పాలించలేడని ఘంటాపథంగా చాటారు 'మయూరుడు చేసిన దాని వలన మరల వచ్చి ఏ ఇతర చక్రవర్తియు శాతవాహన రాష్ట్రమును స్వాధీనము చేసికొనలేడు ఏ గ్రామమున కాగ్రామమే దుర్గము. స్త్రీలుకూడ సైనికులే!' యుద్ధ సమయంలో గ్రామాలు వర్తించే తీరు మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. 'శత్రు సైన్యాలు వచ్చుచున్నచో ప్రతి గ్రామమునకు రెండుదినములకు ముందే తెలియును. ఆవచ్చు సైన్యముయొక్క బలమును బట్టి వలసినచో అందఱు గ్రామమే వదలిపోవుదురు. శత్రు సైన్యములకు ఆహారపదార్థముల నందనీయరు .. సర్వ సైనిక శిక్షయు దేశమునందు ప్రతి వ్యక్తికి నేర్పబడెను.' విశ్వనాథ యుద్ధాలు దేశభద్రత కాంక్షలని గుర్తించారు - మయూరుడు కొరడాతో తన మొహంమీద పరిహసిస్తూ కొట్టిన వీరవర్మను, నాలుగు నెలలు బంధించాడు. చివరకు విసుగెత్తి వీరవర్మ 'నన్నేమి చేయదలచావు?' అని అడిగిన ప్రశ్నకు 'నిన్నేమియు చేయదలచుకొనలేదు. నిన్నును నీ సైన్యమును వదలిపెట్టినచో . చక్రవర్తితో చెప్పుదురు. ఆయన మఱల నామీదికి సైన్యమును పంపించును నేనా సైన్యముతో యుద్ధము చేయుచుందునా? నారాష్ట్రము నంతను చక్కపఱచుకొనుచుందునా? రెండు నొక్కసారి చేయుట సాధ్యం కాదు. అందుచేత నేను నారాజ్యము నంతను చక్కబఱచుకొనుచుండగా మీవలననే వార్తయు చక్రవర్తికి తెలియనీయలేదు. నాపని పూర్తియైనది. నిన్ను రేపే వదలిపెట్టెదను.'

భల్లాతుని సేన చొఱబడు ప్రదేశాన 200 గ్రామాలను స్త్రీబాల వృద్ధులతో ధాన్యం లేకుండా ఖాళీ చేయించాడు మయూరుడు. గ్రామస్థులు ప్రత్యేకంగా దాగి ఉండే స్థలాలు రహస్యంగా నిర్మింపబడినవి. వారు ఇపుడు కనిపింతురు. ఇపుడు కనిపించరు.

భల్లాతుడు మూలబలం కదలకుండా ఉండటానికి తనయావదాస్తిని తాకట్టుపెట్టి, నెలజీతాలపై సైన్యాన్ని పెట్టాడు అదిశివస్కంధవర్మకు తెలిసింది. చక్రవర్తులు రాజులు విచిత్రమైన వ్యక్తులు. మంత్రులు, సేనాపతులు, ఉద్యోగులు రాజు సొమ్ము తింటూంటారు. ఆసంగతి వారికి తెలుసు. 'తింటేతిన్నారు లెమ్మని వారు ఊరుకుంటారు అందువల్లనే అలా సంపాదించిన ధనాన్ని మయూరునితో చేసే యుద్ధానికై ఖర్చు పెట్టాడన్నది పల్లవరాజు కోపోత్పత్తి హేతువైంది.

మనస్ఫూర్తిగా దేశభక్తితో యుద్ధం చేసే సైన్యం వల్లనే విజయం లభించాలిగాని, కిరాయి సైనికులవలన లభించదనే రాజకీయ రహస్యాన్ని రచయిత సున్నితంగా చెప్పారు. నెలజీతపు సైనికులు మయూరుని కోటలో ప్రవేశించగానే భల్లాతవర్మ సైనికులపైనే తిరగబడ్డారు. అపుడు 'వీరుకూడ మయూరుని సైన్యమేనా! నెలబత్తెపు సైనికులను మగుర్చుకొనుట ఎంతయుద్ధ నీతివ్యతిరేక విషయము?' అని ఖిన్నుడౌతాడు భల్లాతవర్మ.

విప్లవ విషయం తెలిసి పల్లవరాజు సైన్యాన్ని పంపాడు. సైన్యం నిరాళి నుండి బయలుదేరి స్థానాకోడూరును ముట్టడించింది. ఆశ్చర్యం! కోటలో ఒక్క పురుగు కూడ లేదు! తిరిగి వెళ్ళేటపుడు సైన్యంలో చీలిక లేర్పడ్డాయి. శాతవాహన రాష్ట్రీయులకు పల్లవదళవాయిల క్రింద ఉండటం మిష్టం లేదు. ఇలా రచయిత జాతీయతా భావమర్మాన్ని అతిసున్నితంగా సాక్షాత్కరింప జేశారు. ఆసైన్యం నిరాళినుండి ఇటురాగానే అటు మయూరుడు నిరాళను కాస్తా ఆక్రమించేశాడు. గ్రామాల్లో పల్లవ

సైన్యానికి మంచితీర్థంకూడా పుట్టలేదు. ప్రజలందరూ మయూరుని పక్షమే! అంతటి రాజభక్తి వారి కేర్పడే టట్లుగా మయూరుడు మసలాడు. మూడురోజులకే పల్లవసైనికులంతా పారిపోయొచ్చిరి. వారంరోజుల్లో సైన్యంలో ఒక్కడూ నిలవలేదు పట్టణ ప్రజలందరూ మయూరుని పక్షమే! అంతటి రాజభక్తి వారిలో ఎట్లేర్పడినది? -

'రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః
పాపే పాపాస్సమే సమాః'
రాజాన మనువర్తంతే
యథా రాజా తథా ప్రజా'

ఈ శ్లోకానికి ప్రతిబింబమే విశ్వనాథచే సృష్టించబడిన మయూర పాత్ర.

'శాతవాహన రాష్ట్రాన 16 ఏళ్ళ బాలుడు మొదలు 60 ఏళ్ళ వృద్ధువఱకు సైనికులే యైరి. మయూరుడు తానుపోని గ్రామం లేదు. అందరతో తానే మాటాడును. అన్నికుటుంబాల యోగక్షేమాలను విచారించును.' 'మృదునా రక్ష్యతే భూపః' అన్నసూక్తికి తార్కాణం విశ్వనాథవారి మయూరుడు. వృద్ధులు నిలబడితే 'తాతా! కుఱ్ఱవాడను నేను రాగా లేవవలెనా?' అని గౌరవం చెఱుపును. ఏడ్చే పసివాడిని చంకకు తీసికొని ఉత్తరీయంతో ముక్కుతుడిచి ఓదార్చును. ఇంతలో తల్లి సిగ్గుతో, భక్తితో నవ్వుతూ పసివానిని తీసికొనును. ఆమె ఆవార్త పదిమందితో చెప్పును. 'భ్రమన్ సంపూజ్యతే రాజా' మయూరుడు ఇంటింటికీ తిరుగుతూ తానూ ప్రజల్లో ఒకడుగా మెలగాడు కాబట్టే ప్రజలందరూ మనఃపూర్వకంగా అతనికి దాసోఽహమనిరి. వీరవర్మ 'మహారాజా!' అని పిలవగా ముక్కుమీద వేలుంచుకొని 'అయ్యా! నేను మహారాజును గాను, సేనాపతిని గాను. శాతవాహనరాష్ట్ర ప్రజలకు నేనొక సోదరుడను. నాకు బ్రాహ్మణు లని, బెస్త లని భేదము లేదు. నాతలిదండ్రుల కులము నాకు తెలియదు. హారీతుడైన రామశర్మ నన్ను పెంచిన తండ్రి అందుచే నేను బ్రాహ్మణుడను. మా దొడ్డిలో కదంబ (కడిమి) వృక్షముండెడిదట అందుచేత మమ్ము కాదంబు లనుచుండిరి.' అన్నాడు. ఈ మాటల్లో విశ్వనాథ వారు అభ్యుదయ భావాలు కలవారని (వర్ణవ్యవస్థపట్ల పట్టుదలలేదనీ) అర్థమౌతుంది.

యుద్ధంచేసే పద్ధతులను అతి వినూత్నంగా చిత్రించారు విశ్వనాథ వారు. స్త్రీ బాల వృద్ధులు కూడా సైనికులే! గ్రామరక్షణ పద్ధతులు వారికి తెలియును శత్రువులదాడి జరిగినపుడు దాగుకొనుటకు వారికి ప్రత్యేకంగా నిర్మించబడిన రహస్య స్థావరాలున్నవి. ఇలాటి ఆధునిక యుద్ధనీతిని ఇందులో జొప్పించినా మనలను భళిరా అని తలఊపింప జేయగల కీలకఘటన మయూరునిబాల్య సంఘటనమే! మయూరుని తల్లిదండ్రులు, కుటుంబము ఆటవికసైన్యందాడికి బలి అయ్యారు కాబట్టే మయూరుడు తన రాజ్యంలోని ప్రతిగ్రామానికీ రక్షణ ఏర్పరచి, ప్రతివ్యక్తికీ రక్షణోపాయాలను నేర్పాడు. - స్థానాకోడూరుకోట చుట్టూ లోతైనకందకం, నిండా నీరు. భల్లాతుడు 10 రోజులలో వచ్చుననగా, మయూరుడు ఏటి ప్రవాహాన్ని అరికట్టి, కందకంలో నీ రెండిపోయేటట్లుగా చేశాడు. నీరుతగ్గి ప్రవహించే వాగు ఊబిలా తయారై భల్లాతుని ముప్పుతిప్పలు పెట్టింది. తెప్ప వేయాలంటే నీరు లేదు నడవబోతే ఏనుగులు, గుఱ్ఱాలు ఊబిలో కూరుకొని పోతాయి. చివరకిలాటి యుద్ధంలో భల్లాతుడు బందీ అయ్యాడు. గోళ్లూడగొట్టిన సింహమే అయినా మయూరుడు వానిని వధింపలేదు. పౌరుషహీనుడు, దుర్నీతిపరుడు ఆపని చేయును. మయూరు డట్లుకాడు. తులాయుద్ధ మేర్పరచాడు. సమఉజ్జీగా పోరాడి, భల్లాతుడిని పడగొట్టి, తన తండ్రిని ఏ కడిమిచెట్టుకింద వధించాడో అదే చెట్టుకింద వధించి తన ప్రతీకారం తీర్చుకున్నాడు.

ఇంతటి కార్యకారణ నిబద్ధేతివృత్తంలో కూడా విశ్వనాథవారు అన్నిటికీ కర్త భగవానుడే అన్న విషయాన్ని అంతర్లీనంగా అతి సమర్థవంతంగా జొప్పిస్తూ వచ్చారు మయూరుడు, రామశర్మ, చదువుకై కాంచీనగరానికి వచ్చారు. మయూరుడు భల్లాతుని కనుగొని, అభియోగం తీసుకురా యత్నించెను. రామశర్మ 'ఏజీవి కెట్లు వ్రాసియున్నదో? ప్రతిదానికి ప్రతిక్రియ చేయబూనినచో సాధ్యమేకాదు. ఆ ప్రతిక్రియ భగవానుని చేతిలోనున్నది.' అని అనంతకాల సంబంధియైన బ్రాహ్మణ బుద్ధికి అనుకూలంగా మాట్లాడెను. మయూరుడు తత్కాలబుద్ధినీ పురుషకారం రూపొందిన తనాన్నీ ప్రదర్శించి ప్రతిక్రియ చేయుదు ననెను. పురుషకారం తత్కాల సంబంధి. దైవ మనంతకాలసంబంధి 'నాచేత ప్రతిక్రియ చేయించుటకే కదా భగవంతుడు నన్ను మరచి పోనీయలేదు' అన్నాడు.

వీరవర్మతో - 'పరమ శివుడు నాచేత నా మహాదుష్కార్యమున కంతకును ప్రతిక్రియ చేయించు చుండెను భగవంతుని శిక్షాపద్ధతి చాల విచిత్రమైనది. భగవంతుని శిక్షాపద్ధతి పలురకములుగా నుండును. ఈ దుష్టాధికారులలో కొందరు తప్పించుకొన్నట్లు కనిపింతురు. వారికిని శిక్షతప్పదు. ఇంక రాజులుచేసిన అన్యాయమునకు శిక్ష దీర్ఘకాలము మీద జరుగును నేడు కాకున్న రేపు వారి రాజ్యము నశించును. వారి సార్వభౌమత్వము నేతిబీఱకాయ వంటి దగును.' అన్నాడు. వీరవర్మకు మయూరుని ప్రచండ సేనాపత్యము, శాతవాహన రాష్ట్రప్రజల అచంచల దీక్షా, ఐక్యమత్యం 'ఔరా' అని

పించినవి. 'ఇంతస్వాతంత్ర్య దీక్షాపరమైన' దేశమును పల్లవచక్రవర్తి నిలుపుకొనలేడు' అని తలచెను. ఇది సార్వకాలిక సత్యమే కదా!

'కడిమిచెట్టు' లోని ఇంకొక అపూర్వమైన పాత్ర కుబ్జుడు. విశ్వనాథ వారి వ్యక్తిత్వానికి ప్రతిబింబమే ఈకుబ్జుడు. మయూరుని సర్వసైన్య మొక ఎత్తు కుబ్జు డొక యెత్తు ఇతడుపట్టాస్త్రవేత్త, మహాకవి మయూరుని నిందించిన మొదటి వ్యక్తి కుబ్జుడు. 'ఓరి కుజ్జివాడా! నీవు భగవంతు డిచ్చిన తెలివి తేటలే కాని విద్యచేత రాదగిన వివేకము లే' దనెను 'నాకంటె నీవెక్కువ వివేకవా?' 'ఔను' 'అయినచో నా వెంటరమ్ము.' ఈ సంభాషణ నాటి నుండి కుబ్జుడు మయూరునకు సకలగ్రంథములలో నున్న మహావిషయాలను పది నెలలలో పుక్కిటి పురాణాలుగా చెప్పాడు. అర్థవార్తా శాస్త్రాలూ, శుక్రనీతి, కామందకనీతి సర్వాన్ని కుణ్ణంపై మయూరుని ప్రక్కను పోతూ బోధించాడు. మయూరుని శౌర్యగీతాలు అతని నుండి వేలాగా ప్రజలు పాడసాగిరి. కాదంబరి మయూరునకు కుబ్జుడు ఆస్థాన కవి, పరమమిత్రము. మంత్రోపదేష్టయై ఆచార్యుడైన నాటినుండి మయూరుడు అదివరకు పరిహాస మాడెడువాడు – నాటి నుండి మానివేసెను.

మయూరుడు, ఘనవిజయాన్ని సాధించాడు. కాదంబవంశీయులు (క్రీ. శ. 310 నుండి క్రీ. శ. 595 వరకు) 2 శతాబ్దాలు రాజ్యపరిపాలన చేశారు. కుబ్జుని యశోగీతాల్లో వారు అమరజీవు లయ్యారు. 'కాదంబులు మానవ్యగోత్రు లట, హారీత పుత్రులట; శతాశ్వమేధులట. ఆ కవికల్పన కంతు లేకపోయెను. ధర్మరక్షణచేసిన రాజును కవి తన ఇష్టము వచ్చినట్లు వర్ణించును. అవి లౌకికముగా నబద్ధములు. ధార్మికముగా యథార్థములు. సర్వథర్మము రసమయము రసమనగా హృదయగత సమార్ద్రమధుద్రవ స్పందనము. ఆ స్పందనము కలిగించిన కవికంటె యథార్థవాది ఎవడు?

కుబ్జుడట్టి మహాకవి. కుబ్జుడు తన గీతము లా కడిమిచెట్టు చుట్టు నల్లెను.'

మయూరునికి మిత్రమై, తీర్చిదిద్ది, మంత్రోపదేష్టయై సంస్కరించి, తద్యశోగానమును దశదిశలా పరివ్యాప్తమొనరించిన ఘనుడు కుబ్జుడు విశ్వనాథ వారి ఆదర్శమూర్తియే కుబ్జుడు 'కడిమిచెట్టు'లో నాయకుడు మయూరుడుగనే కన్పడును, గాని చివరకు నవల ముగింపు కుబ్జుడు చేసి, తానే నాయకుడయ్యాడు.

— —

# దౌత్యము

శ్రీ జయంతి వేంకటశాస్త్రి.

ఉ. ఏనొక దేవదూతను ప్రియేచ్ఛకు బ్రోత్సహానంబు సల్ప భా
గ్యానను జాలియుంటి, నిను గాంచి శుభోత్తర వార్త దెల్పగా
మానిని! వచ్చినాడ వినుమా! నను యక్షుడు నీదుభర్త స
మ్మానముతోడ నంపె హనుమంతుని యంతటివాడ నంచిటన్.

ఉ. సేమము చిత్రకూటగిరి సీమనివాసి ప్రవాసి కేవమై
ప్రామిన దుఃఖభారమున పాటవమింత దొఱంగ చిక్కి, నీ
పై మతిబారివన్ భవదభాగ్యము కన్నులముందు నిల్వ ని
న్నోంచగ రానివా డకుచు నుమ్మలి కమ్మన నీదుచ్ఛకాలమున్.

ఉ ముద్దియ నిన్ను నీచెలుల ముందఱ మోము స్పృశింప బూని, యే
కొద్ది ప్రియంపు బల్కు చెవికోసల జెప్పుచునుండునంట, దూ
రోద్ధిత దేశమం దునికి యిప్పుడు సాధ్యము కానిదయ్యె నా
నుద్ది, బలీయమావిధియు, చుల్కన సేయును భాగ్యహీనులన్.

ఉ. గైరికధాతు లెన్ని కృతకల్పన నొక్క శిలాతలంబుపై
తీరక నీదు రూపమును దీర్చి ముదంపడ నెంచు నంతలో
వారని బాష్పవారి తెరవా! కనులందు స్రవింప దృష్టి కిం
పారగ పారముం దరియబట్టవు చిత్తరువందు సైతమున్.

ఉ. నిద్దుర రాకరాక కమనీయము స్వప్నమువచ్చి యందు నిన్
ముద్దియ కౌగిలింప కరముల్ వడిసాపగ జూచి జాలిమై
సద్దు నొనర్పకే వనజ సంతతి ముత్యములంత మంచుబొ
ట్లొద్దిక రాల్చు నశ్రుజలమో యన పత్రపు టాలివెంబడిన్.

ఉ శాపము తీరవచ్చినది చాన! శుభంబగు కార్తికీయ చాం
ద్రీ పరిపుష్టరాత్రులు వరిష్ఠము లుజ్జ్వలయోగ సంభృత
శ్రీపరమంబులై పరిమళించెడు నన్నప్రియోక్తి దెల్పి యా
ద్యోపథమంగు సాగె పరితోషిత మానసమూర్తి మేఘుడున్.

# నవ్యకవితా యుగోదయశ్రీ "ఉదయశ్రీ"

– శ్రీ డా॥ జి. బి. యస్. ఆచార్య, ఎం.ఏ; పిహెచ్.డి.

( 21 వ సంచిక తరువాయి )

ప్రేమను కామమునుండి వేరుచేసి స్నేహమునకు సన్నిహితముగా చేసిన గౌరవము నవ్యులకు – ముఖ్యముగా శ్రీ రాయప్రోలు వారికి దక్కినదని చెప్పవలెను. ఈ విషయమునందు వారిపథములోనే పయనించుట చేత కరుణశ్రీ కవితాకన్యలకు – ప్రబంధ సుందరులకు ఎంతేని భేదము గలదు.

'రాట్నసుందరి' అను ఖండికలో–

'పండెను దేవి! నావలపు
పంటలు, పింజలు పింజలైన యీ
గుండెయె యేకుగావడకు
కొంటివి, నా బ్రతుకెల్ల దారమై
కండెలుగట్టె నీదుచర
ఖాపయి, నేనొక చేరుమాలనై
యుండెద మెత్తగా పెదవు
లొత్తుచు నీ కరపాలచేతిలో."

అని నిర్మల స్నేహసమ్మిశ్రితమైన ప్రణయమునే ప్రతిపాదించినారు.

'వైశాఖి' అను ఖండికలో గ్రీష్మ ఋతు ఆధిక్యముతోపాటు, స్నేహమయ ప్రేమోత్కర్షముగూడ వర్ణింపబడినది.

'కుండలమీద పిచ్చుకలు
గుంపులుగూడె, నఖండ చండమా
ర్తాండుడు చేటలన్ జెరిగ
నగ్నికణమ్ములు; వెండిసిరదే,
కొండలు నెత్తిపై పులుము
కొన్నవి, రమ్ము శయింత మీలతా
మండపమందు, ప్రేమమయ
మానసముల్ మధురించి పోవగన్.

పైపద్యములో 'చేటలన్ జెరిగ' అనునది చక్కని జాతీయము. జాతీయములను ప్రయోగించుటలో నవ్యకవులందు కరుణశ్రీ – జాషువగారు పరస్పరము అధిగమించుచుందురు. అట్లే నూత్నప్రయోగములను చేయుటయందుకూడ వీరిరువురిది పైచేయి. పైపద్యమునందు 'మధురించి పోవగన్' అనునది చక్కని ప్రయోగమేకాక, కవిగారి ప్రత్యేకతను చాటుచున్నది. 'చిగురించు, కుసుమించు' ఇత్యాదులు ప్రచురములైనట్లు 'మధురించు' అనునది కాదు. ప్రకృతి భావుకులకు ప్రణయోద్దీపనముతో పాటు, తాపోపశమనమునకు గూడ ఉపస్కారకమైనదని పైపద్యము నిరూపించుచున్నది.

'ప్రాభాతి' అను ఖండికలో–

'రాగము నందుకొన్నది త
రంగిణి, బాల మరీచి మాలికిన్
స్వాగత మిచ్చె పద్మిని, హ
సన్ముఖమై మన దొడ్డిలోని పు
న్నాగము కప్పవోసె సుమ
నస్సులు, కోవెలలో విపంచికల్
మ్రోగెను; లెమ్ము పోదము! ప్ర
మోదముతో మన మాతృపూజకున్.

అని ప్రాభాతసమయములో పవిత్ర కార్యము నాచరించు తమ పవిత్ర మనోభావమును వెల్లడించినారు. 'పున్నాగము కప్పవోసె సుమనస్సులు' అను ప్రయోగము కవిగారి సుమన స్సౌందర్యమునే గాక, సుకవితా సౌరభమునుగూడ వెదజల్లుచున్నది.

'తపోభంగము' అను ఖండిక ఒక కవితాకథానిక. ఇది కరుణశ్రీ చేతిలో పరాకాష్ఠ చెందినది.

మధుమాస మనోజ్ఞ మహోదయమ్ములో పార్వతి మూడుకన్నుల మునిమౌళి ముందు నిలిచినది. 'అందము చిందిపోవు చెవియందలి చెందొవ జారుచుండ పూలందు కొనుండటంచు సుమనోంజలి ముందుకు (జాచి శైలరాణ్ణందన వంగె–చెంగున సుమాస్త్రుని చాపము వంగె– వంగ బాలేందుధరుండు కాన్కల గ్రహింపగ ఉన్నమితోర్ధ్వ కాయుడై' తీయవిల్కాడు సమ్మోహనాస్త్రము అదను చూచి ప్రయోగించినాడు. అది గౌరికెడకంటి చూపుతో కలిసిపోయి ముక్కంటి గుండెలో గ్రుచ్చుకున్నది. తరువాతి కథ సువిదితమే. పైవర్ణనలో 'సహోక్త్యలంకారము'4 తీర్చిదిద్దబడినది.

'పుష్పవిలాపము'5 అను ఖండిక కరుణశ్రీ భావవైశారద్యమునకు మచ్చుతునక, ఏ శుభముహూర్తమున ఆభావము ఆయన హృదయాకాశములో మెరసినదోగాని, అది తెలుగునాటి కంతటికి వెలలేని వెలుగును పంచిపెట్టినది. కరుణశ్రీ కలమూ, ఘంటసాలగళమూ రెండునూ కలిసి ఆంధ్రప్రజల హృదయకేదారములలో ఆనందసస్యమును పండించినవి.

'మా వెలలేని ముగ్ధసుకు
మార సుగంధ మరంద మాధురీ
జీవిత మెల్ల మీకయి త్య
జించి కృశించి నశించిపోయె; మా
యౌవన మెల్ల కొల్లగొని
ఆ పయి చీపురుతోడ చిమ్మి మ
మ్మావల పారబోయుదురు గ
దా! నరజాతికి నీతియున్నదా?'

అని పూల జాలిపాటను నింబాసహోక్తికముగా మెల్లమెల్లగా వినిపించి పాషాణ హృదయములను సైతము కరగింపజేసినారు.

'బుద్ధదేవుని భూమిలో పుట్టినావు
సహజమగు ప్రేమ నీలోన చచ్చెనేమి ?
అందమును హత్యచేసెడి హంతకుండ!
మైలపడిపోయెనోయి! నీ మనుజజన్మ'

అని, ఊలుదారాలతో గొంతు కురిబిగింపబడి, గుండెలో నుండి సూదులు గ్రుచ్చబడి దీనావస్థలో నున్న పూలచే మెత్తగా చివాట్లు పెట్టించినారు. ఈ నేర్పు ఒక్క

డా॥ నారపరాజు శ్రీధరరాయకవి
(M B , B S, D T M ...
1989

కరుణశ్రీ వ్యక్తిత్వమునకే తగియున్నది 'అందమును హత్య చేసెడి హంతకుండ!' అనుసంబోధనతో కవిగారు సాధించిన ప్రయోజనము అనంతము వీరు ప్రతిపాదింపదలచు కొన్న అహింసా సిద్ధాంతమునకు ఇదెంతయో దోహదము చేయుచున్నది

'కుంతీకుమారి' అను కవితాకథానికలో, గంగానది గట్టుమీద నిలిచి నిర్ఘాంతపోయి, ఏటికెరటాలలోపడిఎక్కడెక్కడికో కొట్టుకుపోయే కొడుకు వైపు నిశ్చలనిరీహ నిర్నిమేష నేత్రాలతో చూచే కుంతీకుమారి గుండెలచప్పుడును దీనాతిదీనముగా మనకు వినిపింపజేసినారు

'ఒత్తుగా పూలగుత్తుల నెత్తు పెట్టి-
పైని చెంగుచింపి మెత్తగాప్రక్కపఱచి-
క్రొత్త నెత్తలిరాకుల గూర్చి పేర్చి-
ఒత్తుకొనకుండ చేతితో నొత్తిచూచి-'

'చెదరు హృదయమురాయిచేసికొని పెట్టె నలలలో త్రోయబోవును - వలపునిలుపలేక - చెయిరాక - సుతు కౌగిలించి వెక్కివెక్కి యేడ్చును - కన్నీరు గ్రుక్కకొనును

కన్నకడుపు తీపియెట్టిదో పైపద్యములలో మనకు చవిచూపినారు. భోగభాగ్యములకు వారసురాలైనప్పటికిని, రాచకులము నందు జన్మించినప్పటికిని కన్నకొడుకునకు పట్టెడన్నము పెట్టుకొనుటకు నోచుకోని మందభాగ్య కుంతీకుమారి - 'నాపుట్టుక మాసిపోను' అని తనను తాను నిందించుకొనుటకన్న ఏమి చేయగలదు? కరుణశ్రీ కవితాలేఖిని సృజించిన మాతృమూర్తి కుంతీకుమారి మనహృదయాలలో కలకాలము నిలువగలిగిన కమనీయ రూపము. కరుణరసము పొంగిపొరలు కవితాకలశ మీ కావ్యఖండము.

'ధనుర్భంగము' - మన సత్త్వ పరిశీలనములో కవిగారికి గల నేర్పును వ్యక్తము చేయుచున్నది

'ఫెళ్లు'మనెవిల్లు-గంటలు గల్లుమనెను-గు
భిల్లు'మనెగుండె నృపులకు-'ఝల్లు'మనియె
జానకీదేహ - మొకనిమేషమ్మునందె;
నయము జయమును భయము విస్మయము
గదుర.

తెలుగుదేశములో ఈపద్యము మారుమ్రోగని మూలలేదు. కరుణశ్రీకి నీరాజనాలు పట్టని హృదయము లేదు

'సిగ్గుబరువున శిరసువంచినది ఒక్క-
సీత యేకాదు-సభలోని క్షితిపతులును'

అనగలిగిన చమత్కారచారుత్వము కేవలము కరుణశ్రీ సొమ్ము.

'భరతజనయిత్రి ప్రేమబాష్పాలలోన
అయ్యె నతివైభవముగ సీతమ్మపెండ్లి'

అని పెండ్లిసందడిలో కూడ భరతజనయిత్రిని విస్మరింపని కరుణశ్రీ దేశభక్తి కీర్తనీయమైనది.

'ఊర్మిళాకుమారి' అను ఖండికలో అనన్యత్యాగశీలియైన ఊర్మిళకు కవిగారు కవితానీరాజనములను సమర్పించినారు అయోధ్యానగరమును, అంతఃపురములను దాటి దండకారణ్యపర్ణకుటిలో తన జీవితసౌభాగ్యమును వెదకుకొను ఊర్మిళాకుమారి ఉత్కంఠను తొణికింపజేసిన రసగుళిక ఈ ఖండిక.

'త్యాగమయదేవివి నీ చరిత్రమే
తెలుపుచునుండె - లోకముహృదిన్
గదలించు సదా త్వదశ్రువుల్'

అని అనుచు పొంగిపొరలిన ఆమె కన్నీటిబిందువులను తుడుచుటకు ప్రయత్నించిన కరుణశ్రీ హృదయము - కరుణరసశ్రీ నిలయము.

'అనసూయాదేవి' అను ఖండిక కరుణశ్రీ కమ్మనికవిత్వపచన ఘుమఘుమలతో మనకు చవులూరించు చుండును.

'అమ్మ! నీచేతి తాలింపు కమ్మదనము
భరతదేశాన గుమగుమ పరిమళించె'

అని అనంత సాధ్వీమణియైన అనసూయా ...ములను భారతదేశమంతటను ...ంపజేసి, తన ఋణమును తీర్చుకొన ప్రయత్నించినారు

'నీ, తియ్యని జోలపాటల కి
దే పులకించెను సృష్టియెల్ల, నీ
యుయ్యాల తూగులో నిదుర
నొందెను లే పగునాల్గు లోకముల్'.

అని తెలుగు గుండెలన్నీ పులకించునట్లు పలికినారు.

'సతీసావిత్రి' అను ఖండికలో-మృత్యుదేవత వెంట ఒంటరిగా పతికొరకు పరువెత్తు సతీమణి సావిత్రి ప్రణయస్వరూపము ప్రతిబింబించినది.

'ఓ దీనత్వము రూపుగైకొనిన ప్రేమో
న్మాదినీ'

అను సంబోధనలో మనముందు ఆనాటి సావిత్రి రూపము సాక్షాత్కరించును.

'పెండ్లి నాడమ్మ చెక్కిట పెట్టినట్టి
కాటుక యరాలు రవ్వంత కందలేదు
పెద్దముత్తైదువలు కాళ్ళ దిద్దినట్టి
పసుపుపారాణి కనుమాపు పడనె లేదు-'

అని బాధాతప్తమైన సావిత్రిపై సానుభూతి సుగంధమును చల్లినారు.

వధూటీ! ఆగిపోవమ్మ! అ
ల్లదిగో కాలుడు చాలదూరమున
నీ వందించుకోలేవులే

అని హితవు నుపదేశించినారు. కాని సావిత్రి పట్టువిడువలేదు తన కృషిని తాను కొనసాగించినది తుదకు కాలునితోపాటు కవిగారుకూడ ఓడిపోయినారు. ఆమందానంద కందళితహృదయముతో -

నిఖిలలోకైక సాధ్వీని నిన్ను గన్న
భరత జనయిత్రి భాగ్యాలు పండెనమ్మ
మెచ్చుకొన్నాడు నీపూర్వపుణ్యఫలము!'

అని ఫలశ్రుతిని పలికినారు. సావిత్రి చరిత్రమును - విశ్వవిచిత్రమును, పరమపవిత్రమును చేసినారు.

'మహాకవిపోతన' - ఈ ఖండికలో, భక్తిరసామృత ప్రవాహముల కేతమెత్తి

జనవశీకరణాద్భుతశక్తి గడించుకొన్న పోతనామాత్యుని చేతి గంటము మనకు ప్రత్యక్షము చేయబడినది.

'ముద్దులు గారభాగవత
మున్ రచియించుచు, పంచదారలో
నద్దితి వేమొ గంటము మ
హాకవి శేఖర! మధ్యమధ్య అ
పద్దెములందు - ఈ మధుర
భావము లెచ్చటినుండి వచ్చురా-

అని పోతనామాత్యుని మధుర కవితా విర్భావమునకు హేతువున్నూహించినారు. మధురరసప్లావితమగు కవితా ఖండికను మన కిష్టాయన మొసంగినారు. కరుణశ్రీ కూడ తమకవితాలేఖినిని 'కలకండపాక ములో ముంచి కవిత్వము' రచించి, ఆ స్వాదింపు డనిమాకు కందించినారు. లేనిచో ఈకవిత్వమున కింతటితీపి యెట్లబ్బగలదు?

' ...కవివో, గడిదేరిన కర్షకుండవో,
రెంటికి చాలి యుంటివి, సరే కలమా
హాలమా ప్రియంబగున్' ?

అని కరుణశ్రీ చమత్కారముగా ప్రశ్నించినను, పోతన 'కవికర్షకు' డని మనము తీర్పు నీయవచ్చును

మహాకవి పోతన, కృతమగు నేదో ఒక పద్యమును (కనీసము) ఎరుగని తెలుగువాడు లేడని నిస్సందేహముగా చెప్పవచ్చును. అట్లే కరుణశ్రీ ఆయన కవిత్వము అని చెప్పుటలో సంకోచింప పనిలేదు.

'ఆంధ్రవిద్యార్థి' అను ఖండికలో ప్రాచీన కవుల ప్రశంసతోపాటు, తమ ఆంధ్రత్వమును సగర్వముగ నిరూపించుకొనినారు. ఆంధ్రసాహిత్యమను నందనోద్యానముగ సంభావించినారు.

'భారతీదేవి మృదులాంకభద్రపీఠి
ముద్దులొలికెడి రతనాలగద్దెనాకు
తెనుగుతోటల సంస్కృతవనలతాళి
నంటుత్రొక్కెడు 'ఆంధ్రవిద్యార్థి నేను.

అని తెనుగుతోటలలో విహరించుచు, సంస్కృత వనలతాళి సౌందర్యమును కన్నార్పకుండ తిలకించుచు, పులకించి పోయిన కరుణశ్రీ ఆధునికాంధ్ర కవితా మాన్యుడు

'తెనుగుతల్లి' అనుఖండికలో ప్రాచీన వైభవమును సంస్మరించుకొని, నేటి దుస్థితికి వగచి-

'దిద్దుకోవమ్మ! బిడ్డల, తెనుగుతల్లి!' అని తమ కన్నీటిని వేదనను సమర్పించినారు.

'వీరపూజ' అను ఖండికలో-

'ఒక ప్రశాంత ప్రభాతాన, ఒక్కమంద
మలయ మారుత వీచిలో పులకరించి
మెల్లగా తల్లి చల్లని కాళ్ళపైన
రాలి కనుమూసికొనుటె సార్థకతమాకు!'

అనియు,

'స్వేచ్ఛాపుష్పాలు' అను ఖండికలో-

'దాస్యబంధవిముక్త స్వతంత్రభరత
మాతృకంఠాన ఒక పుష్పమాలయగుచు
తల్లి యానంద బాష్పాల తడిసి తడిసి
పులకరింపగ అభిలాష గలదు మాకు.'

అనియు పుష్పముల పవిత్రకార్యాచరణాభిలాషను వినిపించినారు. నిజమున కిది కవిగారి అభిలాషయే. నవ్యకవులకు స్వేచ్ఛ, దేశభక్తి - శరీరప్రాణముల వంటివి కదా!

'మాతృశ్రీ' అను ఖండికలో-

'ఆమె బ్రహ్మర్షి జాత కల్యాణగీత
ధర్మసముపేత వేదమంత్ర ప్రపూత
విశ్వవిఖ్యాత సుశ్రీల వెలయుగాత
పరమకరుణాసమేత మాభరతమాత.'

అని భరతమాత యొక్క పావిత్ర్యమును పరమానంద భరితముగా గానముచేసినారు. 'పరమ కరుణాసమేత' అను విశేషణము వలన తక్కినకవుల 'భరతమాత' కంటె కరుణశ్రీ భరతమాత ఒక విలక్షణతను సంతరించుకొనినది.

'నమస్తే' అను ఖండికలో -

'పడుము లర్పించు పిల్లభక్తులకు నెల్ల
యిడుములం దించి కలుములందించు చేయి,
పార్వతీదేవి ముద్దులపాపాయి చేయి;
తెనుగుబిడ్డల భాగ్యాలు దిద్దుగాక!'

అని ఆకాంక్షించుచు, విఘ్నేశ్వరునకు నమస్సులందించినారు. ఈ ఖండికతోనే కావ్యమును ముగించినారు.

పరమేశ్వరునకు సమర్పించిన ప్రార్థనాంజలితో కావ్యము ప్రారంభమై, విఘ్నేశ్వరున కందించిన నమస్సులతో కావ్యము ముగియుట కవిగారి ప్రత్యేకతను, సంప్రదాయాభిలాషను వెల్లడించుచున్నది. కావ్య ప్రారంభములోగాక, ముగింపులో 'విఘ్నేశ్వరు'ని స్తుతించుట గమనింపదగిన విషయము. ఇది కవిగారి నూత్నసంప్రదాయాభిలాషకు చిహ్నము.

'ఉదయశ్రీ' కావ్య పరిశీలనానంతరము-విశ్వశ్రేయస్సు, కరుణరస చిత్రణ, అహింసా సిద్ధాంత ప్రతిపాదన, సమాజోద్ధరణ సౌందర్య భావన, మహిళల యెడ అపారమైన ఆదరణ, మైత్రీభావముతోకూడుకొనిన నిర్మల ప్రణయము, వీరపూజ, దేశభక్తి, శబ్దాలతో చిత్తరువులవర్ణన, పరిశము-సరసము-మృదుమధురము అయిన శబ్దముల కూర్పునందలి నేర్పు మున్నగు విశేషము లెన్నియో మనకు గోచరింపగలవు.

'ఉదాత్తము, మహోన్నతము, రసవత్తరము అయిన భావ పక్షంతోపాటు అందుకు తగిన మనోహరమైన కళా పక్షాన్నికూడా ప్రత్యేకించి కూర్చుకున్నారు పాపయ్య శాస్త్రిగారు.'6 అన్న వేమూరి వారి ప్రశంస సహృదయ సమాదరణయోగ్యమైనది.

ఎందరుకవులు ఎన్నెన్ని ఖండకావ్య మణిహారములను తెలుగు కవితామతల్లి కంఠసీమ నలంకరించినను ఆమెకు 'బరువు' కాదు. సరికదా, ప్రాచ్యప్రతీచీ ఖండములందు ఆమె 'పరువు' మిన్నులను తాకుచుండెను ఈ సమస్యతోనే సరస కవిశేఖరు లందరు సలలిత రాగసుధా రసకావ్యములను వెలయింపగల రని యాశించుట సమంజసము.

—•••—

4. 'సహోక్తిస్సహభావ శ్చేద్భాసతే జనరంజనః' అని 'చంద్రాలోక' నిర్వచనము. ఒకదానికి ప్రాధాన్యము చేత నన్వయము కలుగుచుండగా, అప్రధానమైన యింకొక దానికి సహశబ్దార్థముచేత నన్వయము కలుగవలెను. అట్లు కలిగినపుడు జనరంజకము (చమత్కృతి జనకము) గా కూడ నుండవలెను.

5. దువ్వూరి రామిరెడ్డిగారు 1918-21 మధ్యకాలమున రచించిన 'కుసుమాస్త్రవులు' అను ఖండకావ్యసంపుటి ప్రభావము కరుణశ్రీ 'పుష్పవిలాపము' పై గలదని డా. సి. నారాయణ రెడ్డిగారు విమర్శించుచు, ఈ రెండిటికి 'అభిజ్ఞానశాకుంతలము'లోని ఒక శ్లోకము ప్రాతిపదిక యని తెలిపినారు.

– ఆధునికాంధ్ర కవిత్వము.
డా. సి. నారాయణరెడ్డి. పుట. 427

6. 'అణిముత్యాలు' : శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి. పుట. 167.

సారసాహితీ సదధ్వచారి

# ఆచార్య యస్వీ. 'అప్సరస'

— శ్రీ కర్రా కార్తికేయశర్మ.

కవిప్రశంస :

ఎవని పేరు విన్నంతనె
ఆధునిక విమర్శ సరసమై, సరళమై
నృత్య మిడునో
ఎవని పేరు విన్నంతనె
ఖండకావ్యములన్ని 'పంచకల్యాణి' లా
పరుగు లిడునో,
ఎవని పేరు విన్నంతనె
వచన నాటికలన్నీ 'పాంచికల' వోలె
చిందు లిడునో,
ఎవని పేరు విన్నంతనె
నాటక సాహిత్య మంతా 'మధుర మాధవ' మై
దర్శన మిడునో,
అట్టి పేరుకే పులకించును
యక్షగాన వాఙ్మయము
అట్టి పేరుకు పరవశయగు
ఆంధ్రవిశ్వవిద్యాలయము
అతడె సార సాహితీ సదధ్వచారి
సుమనస్వి, సాహిత్య తపస్వి యశస్వి తేజస్వి
తెలుగు భాషకు ఒజ్జ ఆచార్య యస్వీ.

కవి పరిచయం :

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగు శాఖకు ఆచార్యులుగా సచ్ఛాత్రులను తయారు చేసే యస్వీ జోగారావుగారు పుట్టింది పార్వతీ పురంలో. పెరిగింది సాహిత్య వ్యాసంగంలో. తల్లి సరస్వతి వాగ్గేయ కారిణి, తండ్రి సాంబశివరాయ కవి. సంగీతసాహిత్యాలు వట్టింటనాట్య మాడే కుటుంబం గనుక వీరు పసితనం లోనే సంగీతరహస్యాలు, సాహిత్య మర్మాలు తెలుసుకొని ధన్యు లయ్యారు.

1952లో 'ఆనర్సు'లో ప్రథమశ్రేణిలో ప్రథమునిగా ఉత్తీర్ణత సాధించి, కేంద్రప్రభుత్వ పరిశోధన పండిత భృతితో వాఙ్మయ తపస్సు సాగించి 1957 లో 'డాక్టరు' పట్టాను అందుకున్నారు. అనంతరం ఆంధ్ర విశ్వకళా పరిషత్తున ఉద్యోగం, ఉత్తమపరిశోధకుడిగా సర్ రఘుపతి వెంకట రత్నం సువర్ణపతక స్వీకారం.

ఇక కవిగా, విమర్శకుడుగా, కథకుడుగా ఆయనను పరిచయం చేసే గ్రంథాలు ఎన్నో! పంచకల్యాణి, సప్తతంతువు, ఉపనిషత్తు, అప్సరస, పాంచికలు, మధుర మాధవం, సువర్ణ శృంఖల, లోకాభిరామాయణం, చమోలుం గ్మా వెలువడినవి. వీటన్నిటిమధ్యా నాయకమణిలా ప్రకాశించే గ్రంథం 'ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర' ఈగ్రంథంతో ఆచార్య యస్వీ జోగారావుగారు 'డాక్టరు'గా దిగంత విశ్రాంత విఖ్యాతి నందినారు.

ముత్తం గ్రంథంపై ఒక్క నిమిషం:

'అప్సరస' గేయ నృత్యనాటికల సంపుటి. ఇందులో నాలుగు నాటికలున్నాయి. అప్సరస, కుసుమబాణము, సాక్షాత్కారము, అవిముక్తము. ఆంధ్ర యక్ష గాన వాఙ్మయ చరిత్రను రచించిన ఆవేశంలో ఒక చిన్నయితివృత్తం స్వీకృతమై వర్ణనతో కొంత అనుభూతితో, మరికొంత పద చిత్రాలతో మరికొంత పెరిగి ముగింపుకు వస్తూ పాఠకుని వశీకరణ చేసుకొనడం ఈ నాటికల ప్రత్యేకత.

సంగీతానికి సాహిత్యానికి అంతే స్నేహ ముంది. ఇటు నృత్యంవల్ల, అటు

సాహిత్యంవల్ల సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకొన్న అసలైన గడుసుది సంగీతం. ఈసంపుటిలోని నాటికలు రాగబద్ధమైన పదాలకూర్పుతో, శైలీ విన్యాసంతో నిర్మింపబడ్డవి. ఏనాటికలోను భావాన్ని సందర్భాన్ని దాటి పోలేదు సాహిత్యం. తెలుగునాట తిక్కనతో కొరవడ్డ 'పదాల పొదుపు' ఇందులో మనం చూడవచ్చు. ఫలితంగా శ్రీ జోగారావుగారిని 'గేయతిక్కన' గా మనం అభివర్ణించనూ వచ్చు.

అప్పరస :

ఇందు పాత్రలు అయిదు 1 కామిని. ఈమె జక్కులపురంధ్రి, 2 మురళీధరుడు. పట్టపుకవి 3 ముసలాయుధుడు. మరొక ఆస్థానకవి. 4 మాణిభద్రుడు. ఒకమహారాజు, 5 భటుడు. రాజుగారి చప్పట్ల శబ్దంలో జీవించే వాడు.

మొదటిరంగ ప్రారంభంలో పూలతోటలో కామిని యక్షగానము అభినయిస్తూ పాడిన పాటను చిత్తగించండి.

'ఇది మంచి సమయము రారా
ఎదలో మధువు చేకోరా
రార రమ్యాకార మారా
రాధికా మధురా శయా
జాల మేల ఈ వేళ
గానలోలా వేణుగోపాల ||ఇది||
భృంగసంగీతికి పొంగిపోవుటె కాని
అంగ వించదు పుష్పాంగనాకులము
నీవేణురవళికి నిఖిలము గోకులము
నీవైపెనడచెను వ్రేపల్లె వేలుగా ||ఇది||

ఈ పాటను పాడుతూ, అభినయిస్తున్నంతలోనే మాణిభద్ర మహారాజు, మురళీధర మహాకవి ప్రవేశిస్తారు. ఒక పద్ధతిలో మురళీధర ఆగమనాన్ని ఈగేయంలో కవి సూచిస్తారు. 'ఆగామిని' ముందుగా కవితలో సూచించడం ఒక మర్యాద. ఆ మర్యాదను కవి యిందు మన్నించారు.

మహారాజు కామిని నాట్యవిన్యాసమునకు పరవశించిన వాడై

'సుందరి! నీ అందము చందము
సంగీతము నాట్యభంగి
సర్వము మా మనః పర్వ
మైనదింక మళ్ళుము మా
రాణి వాసమునకు నీవు
రావచ్చును పోవచ్చును
రాకపోక గాక యచట
కాపురమే సేయవచ్చు'

అని అంటాడు. మురళీధరుని ద్వారా రాజు ఇత డని తెలుసుకున్న కామిని

'మహాప్రసాదమ్ము ప్రభూ!
కానీ నాదొక్క మనవి
వాడ వాడ నాడి పాడి
వేడుకతో విచ్చలవిడి
వియచ్చరపు బ్రతుకు బ్రతుకు
నాకెందుకు లేనిపోని
రాచ రచ్చ లోయి ప్రభూ'

అని తన స్థితిని తెలియపరచి 'రాచవీడ' పట్ల తన అయిష్టతను వ్యక్తపరుస్తుంది. కళాకారులలో సహజంగావుండు నిరాడంబరత, స్వేచ్ఛాప్రియత కామినిలో చోటుచేసుకోడం గమనార్హం. కాగా అచ్చమైన తెలుగువారి ఆడపడుచుగా కామిని పాఠకుని హృదయంలో ముద్రితమౌతుంది. పైగా రాజులబుద్ధులు ఆమెకు తెలియనివికావు. అంతఃపురాలలో జరిగే రగడలకథలు ఆమె చాలా వింది. అందుకే

'రాజా రసరాజ్య బిడౌజా!
యోజింపుము మహారాజా
రాజులు మాపై మోజులుపడితే
రాణులు బేజారెత్తదరేమో!'

అని రాజుకు భవిష్యత్తును సూచిస్తుంది.

'ఆ భయాము నీకేల అభయ మిచ్చెద నేను' అని అంటాడు మురళీధరమహాకవి

'అవునుగాని అతివా నీ వెవరవు
ఏమి సేయు చుందువు
ప్రభువు మాట కేమందువు ?'
అని ప్రశ్నిస్తాడు.

'నేనా ఒక జక్కుల కుల కన్యను యక్ష
గానాఖ్య కళా కౌశల ధన్యను
కామేశ్వరి మా యిలవేల్పందురు
కామిని యని నను పేర్కొందురు'
అని కామిని సమాధానమిస్తుంది.

మరల కవి—

'ఒక్కర్తెవు నుందువు నీ
ఇక్క డేమి చేద్దా మని?'

అని ప్రశ్నిస్తాడు

'ఒక యక్షగానమ్మును
పద కేళిక పద్ధతిపై
అభినయమ్ము నభ్యాసము
సేయు చుంటినయ్యా యిచట'

అంటుంది కామిని.

'ఆగ్రంథము పే రెయ్యదియో
ఆకవి యెవరో వాకొనుమా'

కవి ప్రశ్న.

'ఆ కావ్యము కామేశ్వరి కల్యాణము
మాజక్కుల కులదేవత మాహాత్మ్యము
కర్త మహాకవి మురళీధరుండు
అతడిప్పటి కవులందున ఘను డందురు'

కామిని జవాబు.

అప్పుడు రాజు 'ఆమహామహుని చూడదలంచితివా?' అని ప్రశ్నిస్తాడు. దానికి కామిని

'ఎంత భాగ్యం బెంత భాగ్యము
ఆ మహాకవి దర్శనమునకై
కామవల్లికి ముడుపు గట్టితి
కాంక్ష దీర్చుము దేవరా!

అంటుంది.

'ఆ మహామహుడు పరమాప్తుండు మాకు
మామకాస్థాన కవి మండలీనుండు
నిఖిల సత్కళలకును నెలవు మాకొలువు
రాజనర్తకి వౌచు రాణింపు నీవు'

అని అంటాడు రాజు. అయినా జంకుతుంది. అప్పుడు మురళీధర మహాకవి తన పేరు తెలియనివ్వక హితుని వలె

నానావిధ నవ్య నాట్య
గానకళా కల్యాణీ!
మాణిభద్ర మహీపాల
మహాస్థాన మండపమున
నీ గీతము తీగసాగి
నీ నాట్యము పూలు పూచి
పుడమి కళా సుశోభితమై
పులకించును
ప్రభువు మాట జవదాటకు మిక'

అంటాడు. ఎట్టకేలకు ఏ ఆశ లేకున్నా మురళీధర మహాకవి దర్శనాభిలాష చే కామిని రాజనర్తకిగా అంగీకరింపక తప్ప లేదు

ఒకరోజు మురళీధర మహాకవి గీతాన్ని ఆలపించగా, కామిని నృత్యం చేస్తుంది. మురళీధర కవితసాహిత్యగోదావరీ వరదలావుంటే, కామిని నృత్యం రసజ్ఞుల గుండెలలో ఆనందపుగజ్జెలు మ్రోగే విధంగా, సాగింది. ఇక మెచ్చుకోకేం చేస్తాడు రాజు.

'చాంగు మహాజక్కులకుల
నాట్యకళాకీర్తి కళా!
నీయందము నాట్య హేల
నినుమడించి కనులకు మిరు
మిట్లు గొల్పె
నామనసును మురపించెను
లోలాక్షీ అందముతో
లోకములే లోగొందువు'

అంటూ

రత్నహారాన్ని బహుమతిగాయిస్తాడు. మురళీధరమహాకవి తాను రచించిన 'అప్సర' కావ్యమును నమఃపూర్వకముగా రాజుకు అంకిత మిస్తాడు. దానిని అందుకొని రాజు

'మహా ప్రసాద మహామయ
హా కవీంద్ర మురళీధర!
మను మనేక వసంతములు
మధుర కావ్య కలస్వనము
లాలపించు కోయిలవై'

అని ప్రశంసిస్తూ, తన ఆకాంక్షను వ్యక్తపరుస్తూ కర్పూర తాంబూలాదికము గల పళ్ళెరాన్ని అందిస్తాడు. ఇక్కడివరకు కథ ఆనందంగా, ఆహ్లాదంగా నడుస్తుంది. గమనాన్ని మార్చుకున్న కథ

కామినీ, మురళీధరులు రాజు వద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళిపోతారు. రాజు, ముసలాయుధుడనే మరొకకవి మిగిలి ఉంటారు. అప్పుడు రాజు ముసలాయుధునితో

'చూచితివా సుకవీంద్రా!
ముసలాయుధ రసికచంద్ర
మురళీధరు కావ్యవాణి
మురళీస్వర శ్రావ్యవాణి'

అని ప్రశంసగా పలుకుతాడు. తగిన సమయంకై వేచియున్న ముసలాయుధుడు తన పేరుకు న్యాయం చేకూర్చాడు.

'చూచితి చూచితి
వేచివేచి వేసారితి
మురళీ ధరునకు
మరలునో మన సని
మంచిబుద్ధి వచ్చునో యని
చూచితి చూచితి
వేచివేచి వేసారితి'

అంటాడు సామర్షముగా.

'అదియేమిటి అట్లందురు
ముసలాయుధ కవిచంద్రా!'

అని రాజు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడు. దానికి ముసలాయుధుడు,

'ఏమని చెప్పుదు స్వామీ అదియొక
భామకలాపము మురళీధరకవి
స్వామి ద్రోహము సలుపగ బూనెను'

అని మూడుపుల్లలు అంటించి తగిలించాడు రాజుగుండెకు. నిజాన్ని గమనించనంత ఎత్తుకు రాజుగుండె మండింది. విషయం వివరించ మంటాడు. ముసలాయుధుడు ఆ అవకాశాన్ని తన దృష్టిలో 'సద్వినియోగం' చేసుకుంటాడు.

'ఆఁ ఏమున్నది స్వామీ
ఆ చక్కని చైతక్కల
టక్కులాడి జక్కుల జవ
రాలి తోడి
సంగీతపు సాహిత్యపు
వ్యాసంగము సంగముగా
అని అర్థోక్తిగా ఆపేస్తాడు.

అంతే! కథ విషాదాంత తీరానికి పరుగులు తీసింది. రాజు మురళీధర మహాకవికి మరణశిక్ష విధిస్తాడు. ఈ విషయం కామినికి తెలిసింది.

'అతిఘోరము ఉరిశిక్షా?
తత్క్షణమే మహాకవిని
రక్షింపుము'

అని రాజుకాళ్ళపై పడుతుంది. కాని రాజు, కనికరించడు. అప్పుడు కామిని

'కవిని, నన్ను, నీకను దోయిగ
ప్రేమించితి విది సత్యము
నీచే ప్రేమింపబడిన
మేమిరువుర మొండొరులను
ప్రేమించు కొనంగ రాదో!
ఇది ప్రేమకు ప్రతిషేధమొ
ప్రేమకు కూడా ప్రభు శాసనమో!'

అని రాజు అవివేకాన్ని మెత్తగా మందలిస్తుంది. అయినా రాజు వినడు.

'మణి ఖచితము చేసితి నొక
మట్టిబొమ్మ చేపట్టి
మాటనేర్చి మట్టిబొమ్మ
మణులు మ్రింగె మము దొరంగ'

అని ఆవేశాన్ని ప్రకటిస్తాడు. 'ఎవడో కిట్టని కిటిబము' మీకేవేవో చెప్పాడని వాపోతుంది కామిని. 'నే నెంతో త్యాగపరుణ్ణనే రాజు అహంభావంపై ఒక చావు దెబ్బ కొడుతుంది.

'ఇందాతని దోసము లేదే నే
ముందాతని ప్రేమించితిని

ప్రేమున్నది ప్రతిఫల మాశింపగు నను
నీవే నిజముగ ప్రేమించినచో
ప్రేమ మహత్తే నీకు తెలిసిన
తత్క్షణ మాతని రక్షింపుము
నాయెద నాతని కంకిత మిచ్చితి
నాదేహము నీకర్పణ చేసితి
త్యాగము నాదా నీదా స్వామీ!
బాగుగ యోజింపుము నీ
చిత్తము వచ్చిన శిక్ష విధింపుము'

ఈ మాటలు కామిని ముగించేసరికి ముసలాయుధుడు చల్లగా అక్కడి నుంచి జారిపోతాడు రాజులో పరివర్తన కలుగుతుంది.

ధన్యము మీ దాంపత్యము
ప్రణయధర్మ పవిత్రములు
లలితకళా ఫలశ్రుతులు
మీ బ్రతుకులు!'

అని ప్రశంసించి, శిక్షను రద్దుచేయు ఉద్దేశ్యముతో భటుని కొరకు చప్పట చరుస్తాడు.

భటుడువచ్చి మురళీధరుని కన్నులు రాజు హస్తమునం దుంచి, ఇది మహాకవి చివరికానుక అని చెప్తాడు.

'ఇది యేమిటి! యిదియేమిటి!
కవిలోక శిఖామణి ముర
ళీధరకవి కనులా యివి!
ఎంత ఘోర మెంత ఘోర
మతి దుర్భర మీదృశ్యము'

అంటూ రాజు కనులు మూసుకొని కుప్పలా కూలిపోతాడు. కొంతసేపటికి తేరుకొని మురళీధర కావ్యమును చేతఁ బుచ్చుకొని

'ఈయక్షగాన మహాకావ్యము నంకితము గొనుటకు నాకధికారము లేదు, సర్వథా నీవే అర్హురాలవు. ఆ మహాకవి కన్నులాన అతని పక్షమున కాదు సమక్షమున నేను దీనిని నీకంకిత మొనర్చుచున్నాను. దీనిని లోకమున వెలయింపవలసిన భారమునీది,' అని మహాప్రస్థాన

(తరువాయి 15 వ పేజీలో)

# దక్షిణ కైలాస విశేషము

— శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ, ఎం. ఏ.

తెలిమల యన్నఁ జాలు తన దేహము తానె యెఱుంగఁడా శివుం
డలరులఁ దేలియాడినటు హర్షమునందు యమాళనున్న యీ
వలిమలకాని వెండి మలపై వలపెంత మహత్తరంబొ క
న్నులపయి పచ్చకప్పురపు నూగు వెలార్చుచునుండు నిచ్చలున్ ॥

తొలి పవన స్వరూపమును దోఁపగఁ జేయుచు శ్వాస మొప్పి జీ
వుల యెదనున్న దేవుఁడవు పూని వనుంగను మంచు నిల్చు ని
శ్చల తనువైన తెల్ల శిల స్వామి సనాతనుఁడిందె యుండె హా
గ్గులు గనరాని స్వామి దయ దోగి తరింపుఁడు జీవు లెల్లరున్ ॥

ఆ పూలగుత్తి కం తొరాటపడె దేల
యంచు తానై శిరోజాళి ముడిచి
నినుఁ జూచి తమ కనుల్ నిశ్చల మొనరించె
హరిణాక్షి యని కురంగాళిఁ జూపి
ఈ మంద పవనంబు లెంత హాయిని గొల్పు
చెలి నిల్వు మంచు నాసీనఁజేసి
పరిపక్వ ఫలము నీ తరువు రాల్చినదంచుఁ
దెచ్చి యందించి సంతృప్తి నంది
శబర మిథునమ్ముగా స్వామి సంచరించెఁ
దత్పద స్పర్శ గని పవిత్రమ్ము కాని
యణువు లే దిందు నేటి కీ యాకసమ్ము
స్వామి దరహాస చంద్రికా సంభృతమ్ము ॥

అత్త వారింటి భాగ్య మెంతైన గాని, యిల్లరికమన్న హొన్ను సంకోశ్యఁ బడుచె
పుట్టినింటను పడఁతి సంపూర్ణ హృదయ, మర్పణము సేయలేదు నిజాధిపునకు ॥

వలిమలకాని వెండిమల వాసము పర్వతరాజపుత్త్రిని
స్తుల హృదయాబ్జసౌరభము సోనలు వారఁగఁ జేసి వాని వీ
చులఁబడి దేలియాడె శివ సుందరహంసము తన్మనోజ్ఞ కే
ళుల మధుకోశ మానగను లోలుపమా శివభక్తభృంగముల్ ॥

గజాననమున నగజ కయి పూని రా
నానంద నిలయాగ్ర మందు శివుఁడు
బహురూపధారియై విహరించె స్వేచ్ఛమై
స్వస్వరూప స్థిరత్వమున మెఱసి
ఇభరాజ మిథునమై మృగరాజ యుగళమై
వనవరాహ ద్వంద్వ మనఁగఁ జెలఁగు
చెంగు చెంగున దూఁకి నింగి దూకెడు లేళ్ళ
జంటయై వన వీథి సంచరించు
విహగ మిథునమ్ముగా మిన్ను వెంటఁబోవు
నంచ దోయిగ జలతరంగాళి నూగు
కర్మయందు నకర్మతఁ గనుట యన్న
యోగమార్గమ్ము చూపఁ దా నున్నయట్లు.

( 14 వ పేజీ తరువాయి )

పథమున సుదూరగామిగా నిష్క్రమిస్తాడు.

'మురళీధర మురళీధర
నాహృదయ ప్రియవల్లభ
ఎటకేగితి ఎటకేగితి
నీ గొంతుక నిద్రించెన
మూగవోయెనా? మురళి!'

అంటూ కామిని పాడే విషాద గీతికతో నాటిక అంతమౌతుంది.

ఉపసంహారం :-

సుఖాంతంగా నాటిక వ్రాయడం కవికి కష్టం కాదు. విషాదాంత నాటిక వ్రాయడమే ఒక సవాల్! సంఘటనలు వాస్తవికతకు దూరం కాకుండా కల్పించి, అందు పాత్రలు సజీవంగా ఉండేటట్లు జాగ్రత్తవహించి, పాఠకుని పెదవి విరుపుకు నాటిక బలి కాకుండా వ్రాయడం కత్తిమీద సాము వంటిది.

'ఫలానా పాత్రను నాటికలో ఎందుకు చంపారు?' అని కవిని ఏ పాఠకుడు ప్రశ్నించినా, సహేతుకంగా సమర్థించుకో గలగాలి కవి. లేకుంటే కవికి, నాటికకు ప్రశంసా - పూలదండలకంటే విమర్శనాత్మకతే ఎక్కువగా పడే అవకాశముంది.

ఈ 'అప్సరస' నాటికలో కామినిని మిక్కిలిగా అభిమానించిన రాజు, క్రోధంతో మురళీధరునకు మరణశిక్ష విధించడం, మురళీధరుని కవితకు పరవశయగు కామిని అతనిని ప్రేమించడం, తన కంటే మంచి పేరు తెచ్చుకునే మురళీధరునిపై మత్సరంతో ముసలాయుధుడు రాజును మండించడం, వాస్తవానికి చాలా దగ్గరగా వున్నాయి. ఇన్ని వాస్తవాల చట్రం మధ్యలో 'మురళీధరుని మరణం' ఈ నాటికకు పుష్టిని చేకూర్చింది. ఈ విధంగా 'అప్సరస' తెలుగువారి గుండెల్లో పదికాలాలు మనగలిగే అర్హతను సంపాదించుకొంది.

—...—

డా॥ నాగపరాజు శ్రీ[illegible]
(M.B.B.S., D.T.M. [illegible])

# మ[illegible] - [illegible]

( గత సంచిక తరువాయి )

— శ్రీ భారతీప్రియ.

కర్ణుడి వ్యక్తిత్వంలో సుగుణంలాగా కనిపించే మరో దుర్గుణం ఉంది. ఇది దుర్గుణం అనే దానికంటే దుర్బలత్వము అంటే సమంజసము. అది దానగుణం. అతనికి దానకర్ణుడు అనిపించుకోవాలనే తపన చాలా ఉంది. మిడిమిడి జ్ఞానంగలవాళ్ళకి ఇటువంటి తపన ఉంటే మూర్ఖత్వం ఆవేశం ఆవరించి ఆత్మవినాశనానికి కారణమౌతాయి. కర్ణుడి విషయంలో కూడ అతని దానగుణమే అతని పతనానికి కారణమైంది. ఎవరొచ్చి ఏమడిగినా ఇస్తాననడంవల్ల, ఇంద్రుడు వచ్చి అడిగినపుడు తన కవచకుండలాలే ఇవ్వక తప్పింది గాదు.

అందులోనూ ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చాడు. ఇంద్రియ సుఖాలు మిడిమిడి జ్ఞానంగల వారికి, బ్రహ్మమయంగాను, యాచకులుగాను కన్పిస్తాయి. ఇదే ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో యాచకుడుగా రావడం. ఇంద్రియ సుఖాలు అనుభవించడంలో మనం వ్యసనానికి లోనైన మన జ్ఞానాన్ని దేహాన్ని దానికై వెచ్చిస్తున్నాం. ఇదే కర్ణుడు సహజ కవచకుండలాలను ఇంద్రుడికి దానమివ్వటం. ఇది గొప్పగా పైకి కనబడవచ్చు కాని అతి నీచమైన మిత్రద్రోహం ఇందులో ఉంది. దుర్యోధనుడు ఇతణ్ణి సహజ కవచకుండలాలు ఉండుట చూసి గొప్పవీరుడని ఆదరించాడు. మరి అటువంటి వాటిని కేవలం కర్ణుడు కీర్తికోసమని దానమిచ్చేశాడు. ఇది దుర్యోధనునికి అన్యాయం చేయటం కాదా! పైగా ఇందులో మరియొక దుర్గుణంకూడా ఉంది.

ఇంద్రుడికి ముందుగానే సూర్యుడు వచ్చి కవచకుండలాలు ఇవ్వద్దని చెప్పి వెళ్ళాడు. కాని కర్ణుడు వినలేదు. ఇందులో పూజ్య తిరస్కారముతోపాటు సుగుణాన్ని వ్యసనంగా చేసుకోవడం, ఆ ఆవేశంలో అవివేకంగా ప్రవర్తించడం, దానివల్ల మిత్రద్రోహం ఆత్మద్రోహం చేసుకోవడం సంభవించాయి. పరమాత్మ పుత్రుడైన జీవుడు ఆత్మస్వరూపుడు గనుక అతని పుట్టుకతోపాటు కలిగిన దేహమే సహజకవచం. దేహస్థితిని పొందటంవల్ల కలిగిన మిడిమిడి జ్ఞానమే సహజ కవచకుండలాలు. జీవుడికి దేహం ఇవ్వబడింది. గాని దేహంమీద అధికారం లేదు. దానికి కారణం అతడు ప్రకృతిపరమాత్మలకు(కుంతీ సూర్యులకు) పుట్టినవాడనని తెలుసుకోక పోవడమే. దేహపోషణ ప్రధానమైన శూద్రజీవితం గడుపుతూ ఉండడమే. అందువల్ల ఆ దేహంవల్ల కలిగే అహంకారం అతనికి ఈ దేహం తనదే అన్న భావం కలిగిస్తుంది. ఇదే అంగరాజ్య పట్టాభిషేకం. కాని వ్యసనం చేత ఇంద్రియాలకు లోనై మనం బాధపడుతున్నపుడు ఈ దేహంజ్ఞానం మనవి కావని తెలుస్తాయి. ఇదే ఇంద్రుడికి కవచ కుండలాలు కోసి యిచ్చివేయడం.

సూర్యుడు వచ్చి చెప్పినాగాని వినకుండా కవచ కుండలాలు దానమివ్వడంలో దాతృత్వ ఖ్యాతి ప్రధానంగా చూసుకున్నాడు గాని దుర్యోధనుడి మీద దృష్టి లేదు. మిడిమిడి జ్ఞానం గలవాడు అహంకారాన్ని కూడా మరచిపోయి ఇంద్రియ బాధకు గురి అయినపుడు పరమాత్మ జ్ఞానం వాడిలో పని చేయదు. దేహాన్ని ఇంద్రియ బాధకు

అప్పగించి వేస్తాడు. ఇదే సూర్యుడి మాటను లెక్క చేయకుండా కర్ణుడు కవచకుండలాలను దానం ఇచ్చివేయడం ఇందులో వ్యక్తిగత విషయం చూసుకున్నాడుగాని మిత్రుడి మాట తలపెట్టలేదు.

భీష్ముడు తనని అర్ధరథుడిగా నిర్ణయించినందుకు భీష్ముడున్నంతవరకూ యుద్ధరంగంలో తానడుగుపెట్టకపోవడం ఇది కూడా కర్ణుడు వ్యక్తిగత ద్వేషంతో చేసినపనే. ఇందులోనూ ప్రాణమిత్రుడైన దుర్యోధనుడికి సహాయం చేయడం అన్నదృష్టిలేదు. భీష్ముడు-అంటే దేవవ్రతుడు. అంటే దేవతలు నిర్వహింపవలుచుకున్న పనిని నెరవేర్చేవాడు. అందువల్లనే మొత్తం భారత కథ నడవడానికి కారణమైన పాండురాజ ధృతరాష్ట్రులపుట్టుకకు దోహదం చేశాడు. భీష్ముడు - అంటే భీష్మించుకొని ఉండేవాడు. అంటే పెళ్ళి చేసుకోకుండా రాజ్యం అక్కరలేదని మొండిగా ఉండేవాడనికాదు. జరుగుతున్న సన్నివేశాన్ని మంచిదయినా చెడ్డదయినా భగవత్సంకల్పంగా భావించి ఉదాసీనంగాభావించి ఉదాసీనంగా ఉండిపోవడమే అసలైన ధీరత్వం. మనం అలా ఉండగలమా? అందుకే సభలో జూదమాడుతున్నా, వస్త్రాపహరణం జరుగుతున్నా, ఘోరప్రతిజ్ఞలు జరుగుతున్నా అలాగే చూస్తూ ఉండిపోయాడు. భారత కథ జరిపించడంకోసం దేహంతో భూమిమీద నిలచిపోయిన వసువుగదా అతడు. తండ్రికి పెండ్లి చేసేటందుకై రాజ్యాన్ని త్యాగం చేసినపుడే అతడు దేహాభిమానం లేనివాడని స్పష్టమవుతుంది. (రాజ్యమంటే దేహమేకదా!) అందువల్లనే తండ్రి స్వచ్ఛంద మరణాన్ని వరంగా ప్రసాదించాడు. అంటే తనకి బుద్ధిపుట్టినపుడు దేహాన్ని విడిచిపెట్టవచ్చు.

ఈ విధంగా దేహభావం లేక దేహంలో తాను ఉండదలచినంత కాలమూ తాను నిలచి ఉండడమే భీష్మించుకొని ఉండడం. ఆజన్మాంతం పెళ్ళిలేకుండా భీష్మించుకొని ఉండేవాళ్ళని, పదవిని విడిచిపెట్టకుండా భీష్మించుకొని ఉండేవాళ్ళని మనం ఎక్కడైనా చూడగలుగుతాం. గాని రాజ్యం అక్కర్లేదని భీష్మించుకొని ఉండటం, వస్త్రాపహరణం జరుగుతూ ఉంటే భీష్మించుకొని ఉండటం, దుర్యోధనాదులు పాండవులకు రాజ్యం ఇవ్వక పోయినా భీష్మించుకొని ఉండటం, తమది అధర్మం అని తెలిసినా పది రోజులు భీష్మించుకొని యుద్ధంచేయటం, అసహాయ స్థితిలోకూడా అంపశయ్యపై ఉత్తరాయణం వరకూ భీష్మించుకొని ఉండటమూ మనం ఎక్కడా చూడం.

కనుక జరుగుతున్నది దైవసంకల్పమని దర్శింపగలగడమే భీష్మత్వం, భీష్మతత్వం. అందుకే దేవవ్రతుడు అని పేరు పెట్టారు. కనుకనే కర్ణుణ్ణి కవచకుండలాలు ఇంద్రుడికి దానం ఇచ్చేవాడు కాబట్టి అర్ధరథుడిగా నిర్ణయించాడు.

కర్ణుడు తాను దేహభావం కలవాడు కాబట్టి దానికి సంకేతమైన కవచం ఇచ్చేస్తే తానే లేడు. అందుచేత యుద్ధానికి పనికిరాడని నిర్ణయించవలసి ఉంది. కానీ వాడికి తెలియక పోయినా వాడు ఆత్మస్వరూపుడు గనుక, కుంతీ సూతపుత్రుడని తెలిసినవాడు గనుక జరుగవలసిన యుద్ధానికి అనుగుణంగా కర్ణుడిని అర్ధరథుడిగా నిర్ణయించాడు. భీష్ముడు తాను పరిపూర్ణజ్ఞాన స్వరూపుడు. కర్ణుడి మిడిమిడి జ్ఞానరూపమైనవాడు. సంపూర్ణజ్ఞానం సుస్థిరంగా ఉండగా కర్ణుడు యుద్ధంచేయక పోవడం, ఇక్కడ మిడిమిడి జ్ఞానానిదే పైచేయిగా ఉంటుంది. అహంకారానికి ప్రాధాన్యం ఉండదు. ఇదే దుర్యోధనుడికి సాయం చేయాలి. అన్న భావం లేకపోవడం.

ఇంతవరకూ కర్ణుడి వ్యక్తిగతద్వేషం, మిత్రద్రోహం వేరువేరుగా చూశాం. ఇపుడు ఈ రెండూ కలిపిన సంఘటన చూద్దాం. ఇదికూడా దానవ్యసనం అనే దుర్బలత్వానికి ఉదాహరణే. యుద్ధానికి ముందు శ్రీకృష్ణుడువచ్చి కర్ణుడికి జన్మరహస్యం చెప్పివెళ్ళాక కుంతివచ్చి పుత్రరక్షణ అర్థిస్తుంది. కర్ణుడు దుర్యోధనుడి మాట విడిచిపెట్టి అర్జునుడినితప్ప తక్కిన నల్వురు పాండవులనీ చేజిక్కినా కూడ చంపనని మాట యిచ్చాడు.

మరి దుర్యోధనుడికి ప్రధానశత్రువులు పంచపాండవులే కదా! వీరిలో అర్జునుడికి ప్రతివీరుడుగా కర్ణుణ్ణి నమ్ముకున్నాడు. భీముడికి ప్రతివీరుడుగా తనని భావించుకున్నాడు. అటువంటప్పుడు భీముణ్ణి చంపినాకాని అతడుసంతోషించి ఉండేవాడు. లేదా ద్రోణుడు ప్రతిజ్ఞ చేసినట్టు ధర్మరాజుని ప్రాణాలతో పట్టి ఇవ్వవచ్చుగదా! అలాకాక వారందరిని చంపనని మాట యిచ్చి తనకు వ్యక్తిగత ద్వేషం ఉందిగనుక ఒక్క అర్జునుణ్ణి మాత్రం చంపక విడిచిపెట్టనని మాట యిచ్చాడు. మరి యిందులో మిత్రద్రోహం వ్యక్తిగత ద్వేషమేకదా ఉన్నవి.

కుంతికి మాటయిస్తూ తన వ్యక్తిగత ద్వేషం బయట పడకుండా అర్జునుడికి ప్రతివీరునిగా తనని దుర్యోధనుడు ఎంచుకున్నాడని అందువల్ల పంచపాండవులన్న ప్రసిద్ధిపోకుండా అర్జునుడో తానో ఎవరో ఒకరే ఉంటాగని చెప్పాడు. ఇందులో-పంచేంద్రియాల సంఖ్య మారదు గనుక ఈవిధంగా చెప్పబడింది. పంచపాండవులలో ధర్మరాజు అంటే జీవుని యొక్క వాగింద్రియము (వాక్తత్త్వము) భీముడు అంటే జీవునియొక్క ఘ్రాణేంద్రియము (ముక్కు), నకులుడు అంటే జీవునియొక్క పాయువు అనే యింద్రియము (అంగతత్త్వము). సహదేవుడంటే త్వగింద్రియము (దేహతత్త్వము). ఈ

యింద్రియాలన్నీ ఇంద్రియసంపుటిగా జీవిస్తున్నాయి. జీవితో పాటే ఉంటాయి. జీవుడు లేకపోతే యివి ఉండవు. ఇవి ఉంటే జీవుడు లేకుండా పోడు. అందువల్ల ధర్మజ, భీమ, నకుల, సహదేవుల్ని ఏమీ చేయనని కర్ణుడు మాట యిచ్చాడంటే అర్జునుడు కూడా బ్రతికి ఉంటాడని సూచించినట్లయింది. కాని కుంతి కన్నతల్లి అయిఉండి పుట్టినప్పుడే గంగలో విడిచి పెట్టడం, కుమారాస్త్రవిద్యా ప్రదర్శనవేళలో పలుకక పోవడం వల్ల, ఆమెపై కలిగిన అసహ్య భావం వల్ల ఆమాట నోరార చెప్పలేక పోయాడు. అదే శ్రీకృష్ణుడి దగ్గరయితే పాండవులకు విజయం తప్పదని ఒప్పేసు కున్నాడు. మరి పాండవులలో అర్జునుడు అంటే ఇంద్రునియొక్క పుత్రుడు. అంటే ఇంద్రియసంపుటిగా జీవించేలక్షణం. పంచేంద్రియాలలో ఇతడు అగ్నితత్త్వం కలవాడవుతాడు. మరి ఇంద్రుడు అగ్ని ఒకటేగా అంటే ఒకటి అని 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చ' అనే పురుషసూక్తాన్ని బట్టి చెప్పవచ్చు. అందువల్ల పంచేంద్రియాలలో కన్ను పాదము అర్జునుడికి సంబంధించినవి. అగ్ని చలనతత్త్వము గలది గనుకనే దానినుండి మనల్ని నడిపించే పాదం అతణ్ణి నడిపిస్తూ ఉంటుంది.

ఇలా భౌతికంగా నడవడమే కాదు, జీవితం అనే జీవయాత్రలో కూడా అగ్నియే ఆకలి కామంగా దేహములయందు పని చేసి వ్యక్తుల్ని నిలుపుతోంది. ఈవిధంగా పంచేంద్రియాలలో ప్రధానమైన కన్ను, పాదం - ఆకలి, కామం తీర్చుకునే విషయంలో సక్రమంగా ప్రవర్తించాలి. అంటే సరియైన సంపూర్ణమైన జ్ఞానం ఉండాలి. మనం పరమాత్మ యొక్క అంశలం (సూర్యుని పుత్రులం) అని తెలిస్తేనే ఆజ్ఞానం కలుగుతుంది. అది తెలియకపోతే మిడిమిడి జ్ఞానం అలాగే ఉంటుంది. ఆకలి కామాలు కలిగినపుడు గురహంకారం ఒక దుశ్చేష్టను ప్రేరేపించినపుడు ఈ పనిచేస్తేమాత్రం తప్పేమిటి అని చెప్పే మిడి మిడి జ్ఞానమే కర్ణుడు. అంటే అతికాముకుడైన వానికి యౌవనంలో వ్యభిచారం చేస్తేమాత్రం తప్పేమిటి అని అనిపించటమే. జ్ఞానికి సంకేతమైన పాండురాజు కుమారుడు ధర్మాన్ని అనుసరించి జీవించటానికి సంకేతమైన ధర్మరాజుకి తమ్ముడూ అయిన అర్జునుడు - అనే జ్ఞానజీవికి - కామం - దాంపత్య పద్ధతిలో తీర్చుకోవాలి అనిపిస్తుంది. కాదు వ్యభిచారం చేసినా తప్పులేదు అని మిడి మిడి జ్ఞానం అతని అహంకారాన్ని రెచ్చగొడ్తుంది. ఇదే కర్ణార్జునుల విరోధం. ఇందులో ఏదో ఒకటే నిలుస్తుంది. రెండూ ఉండవు. ధర్మబద్ధమైన దాంపత్యమో, ధర్మవిరుద్ధమైన వ్యభిచారమో - ఏదో ఒకటే. ఇదే కర్ణుడు ఆ కుంతికిచ్చిన మాటలోని పరమార్థం.

భగవదనుగ్రహం పొందినవాడయితే మిడిమిడి జ్ఞానం ఎంత రెచ్చగొట్టినా నిగ్రహించి నిలుస్తాడు. అందుకు కావలసిన నిపుణత ఆపరమాత్ముడే నేర్పుతాడు. ఇదే శ్రీకృష్ణసారథ్యంలో అర్జునుడు కర్ణుణ్ణి ఎదిరించి నిలువగలగడం. భగవదనుగ్రహం లేకపోతే దురహంకారం వల్ల దుశ్శాసన స్వభావం (తీవ్ర కాంక్ష) పదిమందిలో వాడి నైచ్యాన్ని బయటపెడుతుంది. కాలక్రమేణా అతని ఎముకలు పనిచెయ్యక కీళ్ళవ్యాధులు సంక్రమించి, దేహం క్రుంగి కృశించి మరణిస్తాడు. ఇదీ కర్ణుడికి శల్యసారథ్యంగానూ రథచక్రం భూమిలో కూరుకుపోడం గానూ చెప్పడం జరిగింది.

శల్యుడు మాద్రికి అన్నగారు. పాండవులకు సొంత మేనమామ. కనుక పాండవులకు యుద్ధసహాయం చెయ్యడం సమంజసం కాని అలా జరుగలేదు. ఎందువల్లనంటే జ్ఞాని అయిన రెండవ ప్రకృతియే రెండవభార్య అని చెప్పుకున్నాం గదా! (పాండురాజు రెండవభార్య ఆ స్థితిలో దేహంలోని శల్యశక్తి (ఎముకలపుష్టి). ఇది జీవని ఇంద్రియాలకు మృత్యుసమరంలో సహాయం చేయాలి. కాని చేస్తున్నాయా? ఒక ప్రక్క ఎప్పుడు ప్రాణం పోతుందో తెలియని స్థితిలో కూడా కీళ్ళు పట్టివేయడం, కాళ్ళు చేతులు కదపలేనిస్థితి వస్తుంది. అంటే పూర్వం అజ్ఞానస్థితిలో చేసిన త్రాగుబోతుపనులూ, తిరుగుబోతు పనులూ లేవూ. నాటిఫలితం ఇప్పుడు జ్ఞానం వచ్చినంతమాత్రాన అనుభవించక తప్పుతుందా. ఇదే కుంతికొడుకయిన కర్ణుడు అజ్ఞానంలో చేసినదుండగాలకు ఫలితంగా శల్యసారథ్యం కుదరడంగా చెప్పబడింది.

అంతేగాక ఈ శల్యుణ్ణి దుర్యోధనుడు మార్గమధ్యంలో మద్యశాలలు మొదలైనవి ఆకర్షణీయంగా ఏర్పాటు చేసి వశపరచుకున్నాడు. అతడుకూడా మత్తులో మాట యిచ్చాడు. ఆ తరువాత ధర్మరాజుకి కూడా సహాయం చేస్తానని మాట యిచ్చాడు. ఇక్కడ ఇతని వ్యక్తిత్వం దెబ్బతినడం కనిపిస్తుంది. దానికి తోడు దుర్యోధనుడు క్షత్రియుడైన శల్యుణ్ణి సూతుడుగా పేరుబడ్డ కర్ణుడికి సారథిగా ఉండమని నియమించాడు. క్షత్రియుడు రథిగా సూతుడు సారథిగా ఉండడం ధర్మం. క్షత్రియుడు రథం నడిపించేవాడు సూతుడు రథం నడిపేవాడు కాని యిపుడు తారుమారయింది. సూతుడే రథి (కర్ణుడు), క్షత్రియుడు సారథి (శల్యుడు) అయ్యాడు. ఈ మార్పు మిడిమిడి జ్ఞానం, శల్యశక్తి అహంకారంతో మొదటశరీరాన్ని స్వేచ్ఛావిహారానికి ఉపయోగిస్తే తరువాతికాలంలో ఎముకలు చెప్పినట్లు దేహం వినవలసి వస్తుంది కాని తన ఇష్టానుసారంగా పని చేయదు. ఇదే సత్కార్యాచరణకు దేహాన్ని వినియోగించనివారికి ప్రకృతి విధించే శిక్ష.

ప్రకృతి ఈవిధంగా దండన విధిస్తుంది. ఆ దండనచేత అతని శరీరం శిథిలమై నానాటికి క్రుంగిపోతుంది. ఇదే కర్ణుడి రథచక్రం భూమిలో క్రుంగిపోవడం.

రథం అంటే దేహం. భూమి అంటే కూడా దేహమే కనుక రథం భూమిలోనికి కూరుకొని పోవడం అంటే వ్యాధిచేత దేహం లోనికి క్షీణించిపోవడం. ఈవిధంగా జీవుడు పూర్వప్రకృతిలో అజ్ఞానంతో చేసిన పనులకి రెండవప్రకృతిలో ఎముకలే బుద్ధి చెబుతున్నాయి. ఇదే కుంతి కొడుకైన కర్ణుడు అజ్ఞానంగా ప్రవర్తించడం వలన మాద్రి అన్నగారైన శల్యుని సారథ్యంలో దెబ్బ తిన్నట్టుగానూ, అప్పుడు వ్యాధిచేత దేహం క్షీణించి పోవడమే రథచక్రం కూరుకొని పోవడంగానూ చెప్పబడింది. ఈవిధంగా ప్రకృతి దండన విధించినపుడు పరమాత్ముడు కూడా అతని దేహం పతనమవడమే సమంజసమని నిర్ణయిస్తాడు. ఇదే శ్రీకృష్ణుడు కర్ణుణ్ణి రథచక్రం ఎత్తుకుంటూ ఉండగా కొట్టడం ధర్మమే అని నిర్ణయించడం. రథచక్రం ఎత్తుకోవడం అంటే దేహం నిలబడని స్థితిలో జీవించాలని ఆశపెట్టుకోవడం. అది నెరవేరక జీవుడు దేహం విడిచిపెట్టడమే సృష్టి పరమధర్మంగా భగవన్నిర్ణయంగా జరుగుతోంది. ఇదే శ్రీకృష్ణుడు కర్ణుణ్ణి కొట్టడం తప్పుగాదని ధర్మమే అని నిర్ణయించి అర్జునుడితో చెప్పినట్లుగా కథలో చెప్పినట్లుగా కథ చెప్పబడింది.

పరమాత్మ జీవులు ఉత్తమదేహములందుండుటకే ఇష్టపడును గాని శిథిలశరీరములందుంటకు అంగీకరింపడు. ఏలయనగా అట్టి శరీరము వలన ఆనందము లభింపదు. మరి ఆత్మ ఆనంద స్వరూపం కదా! అందువల్లనే ప్రాణాపాయ స్థితిలోనైనా భగవంతుడు జీవులకు ఆత్మజ్ఞానం ప్రసాదిస్తాడు. ఆ జ్ఞానమే అర్జునుడు. అట్టి ఆత్మజ్ఞానం చేత దేహాన్ని విడువడానికి సిద్ధపడడమే అర్జునుడి చేతిలో కర్ణుడు మరణించడం. ఒకవేళ ప్రాణాపాయస్థితిలో కూడా క్షీణించిన దేహాన్ని విడువడానికి సిద్ధపడకపోతే పరమాత్మ పూర్వం తాను చేసిన తప్పులన్నీ ఏకరువుపెట్టి ఈవిధంగా దుర్వినియోగమైన దేహం వదలిపెట్టడమే ధర్మం అని నిర్ణయిస్తాడు. ఈవిధంగా జీవాత్మ పరమాత్మ జ్ఞానంతో దేహాన్ని విడిచిపెట్టడమే కృష్ణార్జునులవలన కర్ణుని పతనంగా నిరూపింపబడింది.

ఈవిధంగా స్వచ్ఛమైన ప్రకృతికి పరమాత్మకు పుట్టినవాడైనప్పటికీ జీవుడు అజ్ఞానంచేత దేహభావం పొంది, సత్యం, అశ్లీలం, అన్యాయం అయిన పనులకు దేహాన్ని వినియోగించడం వల్ల కీళ్ళ వ్యాధులు మున్నగునవి సంక్రమించి దేహం శిథిలమై చివరకు ఆత్మజ్ఞానం కలిగి పరమాత్మ సంకల్పముచేత దేహాన్ని విడిచిపెట్టడమే కర్ణుడికథ. మనశరీరం అనే కురుక్షేత్రంలో కూడ మిడిమిడి జ్ఞానమైన కర్ణుడు నశించి పరిపూర్ణజ్ఞానమైన అర్జును దే పరమాత్మ సారథ్యంలో విజయంపొందాలని మహాభారత కథానాయకుడైన శ్రీ కృష్ణపరమాత్మను ధ్యానిద్దాం.

—···—

# రాళ్లపల్లి రచనా రామణీయకత

— శ్రీ కరెవరపు వేంకటరామయ్య, ఎం. ఏ.

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో తమ కంటూ ఒకస్థానం ఏర్పరచుకొన్న కొద్దిమంది రచయితలలో 'ఒకడు రాళ్లపల్లి.' విమర్శకుఁడిగా సహృదయుఁడుగా, ఉత్తమ వాగ్మిగా, సంగీత వేత్తగా ఆంధ్ర కన్నడ సాహిత్య వీథులలో 'జగమెఱిఁగిన బ్రాహ్మణుఁ డాయన. అసదృశమైన పాండిత్యము, పాండిత్యమునకు వన్నెవెట్టు కవిత, కవిత కందమగు చక్కని విమర్శన నైపుణి, విమర్శకు తులలేని వెల కల్పించు సరసత, అన్నింటిని మించిన గానకళామాధుర్యము, రాళ్లపల్లి మూలధనములు. ఆయన తమిళరంగమును కై చేసికొనిరి. కన్నడ కస్తూరిని అందుకొనిరి. ప్రాకృత పాయసమును సేపడిరి. సంగీత సముద్రమును దరియుంగనీదిరి

రాళ్లపల్లి సారస్వత కృషిని త్రిధా విభజింప వచ్చును. అవి 1. పద్యకావ్యములు. 2. వచన రచనలు. 3. పీఠికలు. వీనిలో, పద్యకృతులలో, రాళ్లపల్లి వారి స్వతంత్ర కృతులు, సంస్కృత ప్రాకృత కావ్యములకు అనువాదములు కలవు వచన రచనలలో ముఖ్యముగా ఆయన విమర్శ గ్రంథములను పరిగణింపవచ్చును.

రాళ్లపల్లి వారి కవితావతార ప్రథమ తీర్థము 'తారాదేవి' స్వతంత్రకృతి. వారి పదునెనిమిదవ యేట రచించినారు. 175 గద్యపద్యాలలో ఏకాశ్వాసంగా వ్రాయఁబడిన లఘు కావ్యమిది. దీనికి మూలం చిలకమర్తి 'రాజాస్థానకథావళి.' అవక్ర పరాక్రమ శీలి, మేవాడు రాజకుమారుఁడు నైన హరసింగు చందనాఖ్య వంశ సంభవుఁడైన భద్రసింగు కుమార్తెయగు 'తార' ను వివాహమాడుట ఇందలి ఇతివృత్తం. వీర శృంగార రస సమ్యక్సమ్మేళనమున వరసాగిన చక్కని చిక్కని రచన. రాళ్లపల్లి వారి వర్ణనా కౌశలానికి 'తార' వర్ణన చక్కని ఉదాహరణ.

'హిమబిందు సంయుక్త కమలంబునుంబోలెఁ
జెమట చెమ్మటన్ మోము జినుగువార
నల్లనల్లన వీచు చల్లని లేగాలి
నెఱికురుల్ బెదరుచు నీటుగుల్కు
నుండియు లేని యట్లుండి ముద్దులఁగుల్కు
చిఱు నవ్వులన్ మోవి చివురులెత్త
మొగిలులోఁ గ్రొమ్మించుఁ బోలె మాసిన
చీర
బంగారు నెమ్మేను రంగుమీరఁ

పల్లెవాండ్రకుఁ దగిన యాభరణ ములను
దనతనూకాంతి గ్రొత్తరంగును ఘటింపఁ
దను సహిత ధైర్య లక్ష్మియో యనఁగ నప్పు
డచ్చెలువ వీరిఁ జేరఁగ వచ్చినిలచె'

తార పల్లె పడుచుగా రాజకుమారునికి కనువిందొనర్చి నప్పటి దీవర్ణన. నిసర్గ భావనతో ఒప్పుచు కథానాయిక మూర్తిని పాఠకులకు ప్రత్యక్షము చేయుచున్నది. మసృణ మనోజ్ఞము. 'తారాదేవి' కావ్యము రాళ్లపల్లివారి కథాకథన కౌశలానికి, తెలుఁగు పలుకు బడుల ప్రయోగ నైపుణ్యానికి మణిదర్పణంగా చెప్పవచ్చు' నని డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు గారి అభిభాషణము. కాకినాడ నుండి వెలువడు 'సరస్వతీ' అనే మాసపత్రికలో 1911 లో ఈ కావ్యము ప్రకటితము.

శర్మగారి రెండవ కావ్యం 'మీరాబాయి.' దీని రచనా కాలం 1912. జనశ్రుతిలో నున్న మీరాబాయి కథను గ్రహించి విషాదాంత కావ్యంగా తీర్చిదిద్దారు శర్మగారు. ఇదీ లఘుకావ్యమే. మూలకథలో ఒండు రెండు మార్పులు ప్రవేశపెట్టారు శర్మగారు. మీరాబాయి పేరును మీరాబాయిగ మార్చుట గమనింపఁ దగినది. 'మధురభక్తి' సంప్రదాయము పూర్తిగా పరిత్యజించఁ బడినది.' ఈ చిన్నకథలో మీరాబాయి, ఆమె భర్త, అతని మంత్రి, ఢిల్లీ పాదుషా నలుగురే పాత్రలు .. చారిత్రక ఇతివృత్తము, తద్విన్యాసము, నవ్యతా సూచకములైనా, సలక్షణమైన భావ, ఛందస్సు, కవి సమయాలు అన్నిటా సంప్రదాయ మార్గాన్నే శర్మగారు అనుసరించారు. ఇలా వారు ప్రాత క్రొత్తల మేలు కలయికను సాధించిన వారైనారు' అని అంటారు డా॥ చెన్నా ప్రగడ తిరుపతి రావుగారు. శర్మగారి వర్ణనా రామణీయకతకు ప్రభాత వర్ణనము చక్కని లక్ష్యము.

'తెలివి ముత్తెపుఁ జీర వదల్చియంతఁ
బసిడి సరిగెల చెంగావి వలువఁ గట్టి
పద్మరాగంపుఁ జేర్చుక్క ఫాలసీమ
నపుడు నిలిపి వెలుంగొందు నభ్రలక్ష్మి'

మధుర భావనా విలసితమైన ఈ గణన రాళ్లపల్లివారి మంజులరచనా రీతికి మణిదర్పణము.

శర్మగారి స్వతంత్ర రచనలలో ప్రథమంగా పేర్కొనదగినది పేరెన్నిక గన్నది 'పెనుగొండ కోటపాట.' రాళ్ళపల్లి వారిని కవిగా సుప్రతిష్ఠితుని చేయుటకు ఈ ఒక్క గేయం చాలును. అంతటి వన్నె, వాసీ గల దీ గేయం. జాతీయోద్యమంలో భాగంగా ప్రభవించిన ఆంధ్రరాష్ట్రోద్యమమునకు సంబంధించిన దీ గేయము. 'జననీ జన్మ భూమి శ్చ స్వర్గాదపి గరీయసీ' అనికదా మన ప్రాచీనసూక్తి. గతవైభవాన్ని గుర్తు చేసి తన్మూలంగా ఉత్సాహం కలిగించ యత్నించడం ఈ గేయం లక్షణం.

'చనిన నాటిల తెనుఁగు కత్తులు
సాన వెట్టిన బండ - యీ
పెనుగొండ కొండ'

అంటూ పూర్వుల అవక్ర పరాక్రమోపేతతను గుర్తు చేస్తారు శర్మగారు.

'రంధ్రములఁ బ్రవహించు శత్రుల
రక్తధారలు త్రాఁగి త్రేఁపగ
ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల
అతిథి నీలపుదండ' (యీ పెను)

అని పురాసంస్కృతీ వైభవాన్ని ఒక్కసారి కనులకు కట్టేలా చూపి, తన్మూలంగా ప్రజలను ఉద్యమోన్ముఖులను చేయడం కన్పిస్తుంది.

'తిరుమలేంద్రుని కీర్తి తేనెలు
బిరసి దించిన కాపుకవనపు
నిరుపమ ద్రాక్షారసంబులు
చిందితోలఁకెడు కుండ' (యీ పెను)

నిద్రాణ స్థితిలోనున్న జాతిని జాగృతం చేయటానికి వెలువడిన 'రాష్ట్రోద్యమ కవితలో' ఈ గేయమునకు నిరుపమస్థానం కల దనుట సహృదయులు లెఱిఁగినదే.

శర్మగారి స్వతంత్ర కృతులలో పేర్కొనదగిన ఇంకొక కృతి 'శ్రీమహీశూర రాజ్యాభ్యుదయాదర్శ' అను సంస్కృత చంపూకృతి ఇందలి ఇతివృత్తం మైసూరు మహారాజులకు సంబంధించినది. మైసూరు రాజ్యపాలకులు శ్రీ చామరాజేంద్ర నాల్వడి కృష్ణరాజేంద్రుల పరిపాలనా కాలంలో సాధించిన ప్రగతి, అభ్యుదయము కావ్యేతివృత్తము. మైసూరు పాలకుఁడు శ్రీ నాల్వడి కృష్ణరాజ ఒడయర్ నిండు సభలో జరిపిన కవితా పరీక్ష పోటీలో శర్మగారి కృతికి ప్రథమ బహుమతి లభించినది. ఈ కావ్యంలో మైసూరు రాజ్యాభ్యుదయం వర్ణితమైనా మొత్తంమీద ఇది ఆ అభ్యు

## రచయితలకు

రచనలు ఎంత సంగ్రహముగానున్న అంత శీఘ్ర ప్రచురణకు వీలగును. అతిదీర్ఘములగుటవలన ప్రముఖుల రచనలు కొన్ని మిక్కిలి ఆలస్యముగా ప్రచురింపవలసి వచ్చుచున్నది. మా పత్రిక పరిమితిని దృష్టిలో ఉంచుకొని మాతో సహకరించుచు యథాప్రకారము పత్రికపై అభిమానము చూపగోరిక.

గ్రంథవిమర్శాత్మక రచనలకు ప్రత్యేక ప్రాముఖ్యమని గమనింప గోరిక.

1-11-79 సంచిక వార్షిక సంచికగా ప్రచురింపబడును.

— సంపాదకుడు.

వయానికి కారణమైన ఆధునిక వైజ్ఞానిక సంస్కృతి విజయగాథ అని చెప్పవచ్చు. వస్తువు, శైలి, రస భావాలంకారాలు, కాలోచితమైన సందేశాలతో సర్వాంగ సుందరంగా ఉన్న ఈ సంస్కృత చంపూ కావ్యాన్ని కృతిరత్నంగా తయారుచేసి శ్రీశర్మగారు బహుమతికి అర్హం చేశా' రని శ్రీ హెచ్. ఎస్. వరదదేశికాచార్ గారి అమూల్యాభిప్రాయము. అంతేకాదు శర్మగారి సంస్కృత భాషావైదుష్యానికి, ఆభాషపై వారికి గల ప్రభుతకు ప్రబల నిదర్శన మీకృతి.

కాగా శర్మగారి అనువాద పద్యకృతులలో శిరశ్శేఖరము 'శాలి వాహన గాథా సప్తశతీ సారము.' సాహితీ రసికులకు గాథాసప్తశతి యొక్క జీవస్రవంతి. ఇది ప్రాకృత సంకలన గ్రంథము. (Anthology) దీనిని కూర్చిన వాడు హాలుడు.' Hala, The Seventeenth Satavahana King (A D 20-24) is famous in literature as the compiller of satasai (saptasati) a collection of 700 erotic gathas in the Arya metre in Maharashtri prakrit. In its present from the worte contains linguistic features of the second or third century A D. or even later' అని ఆచార్య నీలకంఠ శాస్త్రిగారి అభిప్రాయము. గాథయనునది ప్రాకృత ఛ్చందస్సు. ఒక పద్య భేదము. ఏగాథ కాగాథ స్వయం సంపూర్ణము. రసనిర్భరము. ధ్వని ప్రపూర్ణము. గాథాసప్తశతికి వేమభూపాలుడు, కలబాల దేవుడు, గంగాధర భట్టు అనువారు వ్యాఖ్యానములు రచించిరి.

వేమ భూపాలుడు (1402-1420) రెడ్డి ప్రభువు. కవిరాజు, రాజకవి. ఈతడు 'సప్తశతి' యందు మనోహరము నూరు గాథల నేరి సప్తశతీ సారము నను టీక రచించెను. అతని ఆస్థానకవి కవితాసనాథుఁడు 'నూనూగు మీసాల నూత్న యౌవనమున' శాలివాహన సప్తశతిని ఆంధ్రీకరించెను. అందు మూడు పద్యములు మాత్రమే ఉపలబ్ధములు. కాగా ఆధునికులలో కొందరు సప్తశతి ఆంధ్రీకరణమునకు పూనుకొనిరి. శ్రీఘట్టి లక్ష్మీనరసింహం, శ్రీ దిగుమర్తి సీతారామస్వామి మున్నగువారు. కాగా రాళ్ళపల్లి వారు శాలివాహన సప్తశతిని సంపూర్ణముగ నాంధ్రీకరించిరి. మొదట 1931 లో కేవలము 395 గాథలను మాత్రమే తెనిగించి ప్రకటించిరి. తదుపరి 1964 లో మొత్తం 735 గాథలను ఆంధ్రీకరించిరి. దీనిని ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రకటించిరి. గాథల ఎన్నికలో శర్మగారు జర్మను పండితుఁడగు వీబరు పండితుని ప్రతిని అనుసరించిరి.

తన కూర్పును అతడు నాలుగు భాగములుగ విభజించెను. 1) గంగాధరుని టీక ప్రకారము కాంబోలు 698 గాథలు గల సామాన్య భాగము. 2) ఇతర వ్యాఖ్యాతల మూలమందు ప్రత్యేకము గాఁగల గాథలు 116. 3) తెలుఁగు దేశమునందలి మూలపాఠము నందలివి 151. 4) పైవాని వంటి అలంకార గ్రంథములనుండి 35 ఇట్లు మొత్తము గాథా సహస్రము సరిగా అతడు కూర్చినాఁడు. శర్మగారును ఇట్లే తమ అనువాదమును నాలుగు భాగములు చేసిరి. చమత్కారము, శ్లేష, ప్రధానముగ నుండి అనువదింప వీలుకానివి, భావము స్పష్టముగా తెలియనివి, సౌమనస్యము ర్యాదను మీఱినవి, కవితావిశేషము లేనివియైన గాథలను శర్మగారు ఆంధ్రీకరింపక విడిచిరి.

'మూలమును రచించిన కవులు, కవయిత్రులు, అందరి రచన సంప్రదాయము ఒకటే. శబ్దార్థముల సంయమము, భావముల ఆర్జవము, అడ్డులేని సహజ ధారయు, తెలింగించు నప్పుడు, పై అసాధారణ గుణములకు లోపము రానీయక, తెలుఁగు పలుకుబడి చెడనీయక, రచింపవలె ననియే నా పేరాస, నా పరాయణము. అందుకై ఏకవృత్త నియమమును వదలి తెలుఁగు జాతికి సహజమైన ప్రియమైన ఆటవెలఁది, తేటగీతి, కందము లందే సాకృషి యథాను కూలముగ సాగించితిని' అని శర్మగారి వక్కాణము. శర్మగారి అనువాదము పరిశీలించిన అది అనువాదమువలె తోచక స్వతంత్ర కృతివలె భాసించును. ముద్దుగొలుపు అలతియలతి తెలుగుపదములతో కూహళ సంధించిన విధముగ నుండును. వీరి అనువాదము,

'కస్సవా నహో ఇ రోసో
దట్ఠూణ పిఆఇ సవ్వణం అహరం
సభమర పడమగ్గా ఇణి
వారి అవామే సహాసు ఏహ్హిం'

అను ప్రాకృత మూల గాథకు కవిసార్వభౌముఁడు శ్రీనాథుని ఆంధ్రీకరణ మిది.

'వారణసేయ దావగొన
వానవ వారిజమంచుఁదేఁటి క్రొ
వ్వా రుచునుంట నీ పెఱుఁగ
వా ప్రియ వాతెఱగంటిఁ గంటికె
వ్వారికిఁ గెంపురాదు, తగ
వా మగవారల దూఱ నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ!'

పైగాథకే రాళ్ళపల్లి వారి అనువాద మిది.

ఎవని కలంక గలుగదే ప్రియురాలి కె
మ్మోవి కాటు గన్న? ముగుద! తేంట్లు
మూఁగి యున్న తమ్మి మూరుకొంటివి, వ
దన్న వినవు, సైఁపవమ్మ యిపుడు! (3-56

ఉపపతి గావించిన మోవి కాటు గృహపతి గమనించి కోపించునేమో యను చెలితో ఒక సఖి వచ్చి ఆమె పతిని గమనించియు గమనించని తీరుగా పలికిన మాటలివి. 'ఓ చెలీ! తుమ్మెద దాగియున్న పువ్వును వాసన చూచావు. అది కుట్టింది. ఆగాటు చూస్తే ఏమగాడు మాత్రం ఊరుకుంటాడు' గృహపతి ఆపలుకులు విన్నాడు. చెలి రక్షింపఁబడినది. ఇక ఆంధ్రీకరణంలో 'తగవా మగవారల దూఱి నీవిభుండారసి నీ నిజం బెఱుగునంతకు నోర్వ' మనుట శ్రీనాథుని స్వతంత్ర కల్పనము. దీనిచే మూలార్థమును స్పష్టపఱచినాడు. శర్మగారి అనువాదము యథా మూలము. శ్రీనాథ కవిత ప్రౌఢమై గంధగజేంద్ర గమనమువలె నుండగా శర్మగారి యనువాదము చల్లగా వీచు పైరగాలికి వరికన్నెల వలపు నృత్యములా నున్నది. ఇంకొక్క ఉదాహరణ చూడుడు.

'ఊరలేఁడు మగఁడు; కారుచీఁకటి_
గ్రమ్మి
నట్టి పాడు రేయి, కట్టి యిల్లు
దొంగలెవ్వరైన దోతురు సుమ్మీ! ని
ద్రింపవలదు ప్రక్కయింటివాఁడ!'
1_263)

చిన్న చిన్న తెలుగు పదములతో సరళ సుందరముగా సాగిన ఈ రచన నేర్పరియైన శిల్పి సన్నపోగారు తనమును జ్ఞప్తికి తెచ్చును. కృష్ణశాస్త్రిగారు చెప్పు 'పదముల రంగు, రుచి' శ్రీశర్మగారికి బాగా తెలియును. అందువలననే శర్మగారి ఆంధ్రీకరణము ప్రచుర ప్రచార ప్రశస్తులను పొందినది. ఆంధ్రుల ఆదరణకు బహుధా పాత్రమయినది. అందుకే ఈ గాథా సప్తశతీ సారమును ఆంధ్రీకరించుట వారియొక్క రసజ్ఞతకును, మన భాషకును గురుత్వ మాపాదించు కార్య' మని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి కతపత్రము.

సుందర పాండ్య విరచిత 'ఆర్య' నీత్యుపదేశములకు కాణాచి, వేయేండ్ల నాటి ఉత్తమ సుభాషిత గ్రంథము. రచనా సౌందర్యమునకు, భావగాంభీర్యమునకు, పలుకుబడి తీరుతెన్నులకు పెట్టని కోట ఆర్య. అందలి సౌందర్యమునకు ఆకర్షితులై, గుణగ్రహణ పక్షపాతులగు శర్మగారు దానిని తెలుగులో మృదుమధురంగా అనువదించినారు. చూడుడు.

'రజనీకరః ఖలు శీతో
రజనీకరాచ్చందనో మహాశీత,
రజనీకర చందనాభ్యాం
సజ్జన వచనాని శీతాని'

దీనికి రాళ్ళపల్లివారు చేసిన యనువాద మిది.

చందమామ చలువ, చందనపంకంబు
'చందమామ కంటె చాల చలువ
చందమామకంటె చందన పంకంబు
కంటె మంచిమాట కరము చలువ'

మూలమునందలి 'రజనీకరః' అనునది తెలుగులో 'చందమామ' యైనది 'మహాశీత,' ను 'చాలచలువ' అనుట తేట తెలుఁగు దనము. ఈ సందర్భములోనిదే ఇంకొక పద్యము.

'నిండు జాబిల్లిగాని, పన్నీరుగాని
చందనముగాని, శీతలచ్ఛాయగాని
తియ్యగా నాడుమాట రీతిని జగాన
మదికి నింపులు గావుగా మానవునకు'
(ఆర్య ప. 12)

ఈ రచనారీతిలో వేమన్నను తలపించుచున్నారు. అనువాదమైనను ఒక్క వ్యర్థ పదము లేకుండా నగిషీ చెక్కినట్లున్నది వారి రచన.

సంస్కృతానువాదములో పేర్కొనదగినది వేదాంత దేశికుని 'అభీతిస్తవ' ఆంధ్రీకరణము. వేదాంతదేశికు లను పేర ప్రసిద్ధుఁడైన వేంకటనాథుఁడీ స్తుతికర్త. భగవద్రామానుజుల విశిష్టాద్వైత సంప్రదాయ సిద్ధాంతమునకు మూల స్తంభము వంటివాఁడు. శ్రీరంగనాథు నుద్దేశించి సాగిన ఈ రచనను గడచిన అష్టగ్రహకూటమి సందర్భమున రాళ్ళపల్లి వారు తెనిగించి ప్రకటించినారు. (భారతి. సెప్టెం. '62)

'కరుణా శీతలమై, రమాలసదుర
స్కంబై, జగద్ధ్వాంతఘ
స్మరమై యార్తుల యొక్క ప్రొక్కు
నకే, ర
క్షాదీక్షు వాటించి, వా
విరిగా వారిధి పాపనా వెలయు కా
వేరీ మహాసైకతాం
తర సంవిన్నిధి నిచ్చమేల్కొనెడుఁ గా
తన్ నామనః పేటికన్

శర్మగారు కాళిదాస 'రఘువంశాన్ని' కొంత ఆంధ్రీకరించినట్లు తెలియుచున్నది. దాని వివరాలు నాకు అలభ్యములు, ఒండు రెండు పద్యములు మాత్రమే నాకు లభించినవి. ఒకటి గమనింపుడు.

'అట్టి సంతతి లేని నన్నెట్టు గనుచు
వంతఁ జెందవు మానివర్య [2] చెపుము
ప్రీతిమైఁ దాన నీర్వోసి పెంపఁదుదకు
గొడ్డువారిన యాశ్రమ కుజమువోలె'

దీనిని కట్టమంచివారు ఉదాహరించిరి. (త్రిలిఙ్గ. 6. సం. 6. జూన్. 1014).

కాగా శర్మగారి శ్రీసంపూర్ణ రచనలలో 'బాలకశతకము' పేర్కొనదగినది. ఇది సంస్కృత శతకము. ఆరుశ్లోకములను మాత్రమే రచించి శర్మగారు ఎందువలననో దీనిని వదలివైచిరి. ఆ ఆరుశ్లోకములను సంపాదించి శ్రీ పుంటిమద్ది శేషశర్మగారు 'భారతి'లో తమస్వీయఆంధ్రానువాదముతో ప్రకటించినారు. (డిసెం. '72) అందలి ప్రథమశ్లోక మిది.

'ప్రాత స్సంత్యజ మందిరం, శ్రయ
  ధనోన్మత్తా, నవజ్ఞాశతం,
మానేనాపి సహాస్వ, శోషయ తనుం
  సేవాసుహీ, మాశుచః,
ఉద్బాహ్యుద్వ్యయ ముచ్ఛ కైరుపహాసన్
  లంబాలకః కేవలం
సాయం త్వా మభిగచ్ఛతు ప్రియతమా
  కణ్ఠావలంబీ శుకః'

అత్యంత మనోజ్ఞమయు భావనాసౌకుమార్యముతో హృదయ రంజకముగా సాగిన ఈ రచన ఆ౬ శ్లోకములతోనే ఆగిపోవుట ఆంధ్రపాఠకలోకం దురదృష్టము.

రాళ్లపల్లివారి కవిత సుందరము, సురభిళము. అయితే ఆయన ఆంధ్రసాహిత్యములో కవిగా సంపాదించుకున్న యశస్సు స్వల్పము. ఉత్తమ విమర్శకుఁడుగానే సాహిత్యప్రపంచమునకు సుపరిచితుడు. దానికి కారణం ఆయన వైమర్శిక దృక్పథమే. గాంభీర్యము, స్థితప్రజ్ఞత్వము, యథార్థ దర్శన యోగ్యత, నిసర్గమైన గుణగ్రహణ పారీణత విమర్శకుడుగా ఆయన లక్షణాలు. ఈ దృష్టితోనే తన సృజనాత్మక వ్యాపారమును ముఖ్యముగా కవితను ఆత్మసాక్షికముగ అవలోకించుకొని, తన ప్రవృత్తికి రెండవమార్గమే శ్రేష్ఠమయిన దని నిర్ణయించుకొని ఏతన్మార్గములో సుదూరగామి అయినాఁడాయన.

రాళ్ళపల్లి వారి రచనలలో ద్వితీయ భాగము వచన రచనలు. వీనినే విమర్శ గ్రంథములుగ కూడ చెప్పుకొనవచ్చును. అవి ముచ్చటగ మూడు. 1 వేమన. 2. సారస్వతాలోకము. 3. నాటకోపన్యాసములు.

ప్రాచీన కవి చరిత్రలను పరిశీలించినచో భరత, భామహ, వామన, ఆనందవర్ధన. పంతికావ్యాలంకారికులు, కాళిదాస, భవభూతి, భట్టబాణ, బిల్హణాది కవులు క్రమముగా విమర్శ సృజన అను వ్యాపారములందు పరిణత ప్రజ్ఞులని తెలియగలము. అనగా ఈవిమర్శ, సృజన అనునవి దేనికది స్వతంత్రముగా మనుగడ సాధింపగలవని, వానిమధ్య వైరుధ్యమేమియు లే దని స్పష్టము. అసలు స్రష్టయగువాడు చేయుపని తుమ్మెద కుసుమమునుండి మధువును సేకరించునట్లు ప్రకృతినుండి భావసామగ్రి సేకరించుట. (The process of synthesis is the business of the creator) విశ్లేషించి దాని పరమార్థమును విశదీకరించువాడు విమర్శకుడు. (The Process of analysis is the business of the critic) ఒక్కొక్క వ్యాపారమునందు అభ్యాసవశమున పరిణత ప్రజ్ఞుఁడైన వ్యక్తికి రెండవ దానియందు పరిణతిని సాధించుట సాధారణముగ సాధ్యము కాని పని. అయినను అట్టివారు లేకపోలేదు. వారి సంఖ్య వ్రేళ్ళమీద లెక్కించుటకు మాత్రమే యుండుట విశేషము. సంస్కృతమున దండి, రాజశేఖర, అభినవగుప్త, పండితరాయాదులు ఇందుకు లక్ష్యభూతులు. ఆంగ్లసాహిత్యములో గోల్డ్‌స్మిత్ Oliver Goldsmith), షెల్లీ (Shelly, P.B), వెల్స (Wells, H G) వెర్న (Verne, Jules), డాడ్జ్‌సన్(కవిగా ఈతనిపేరు Lewies carroll) అట్టివారు. తెలుఁగులో ప్రాచీనుల్లో కేతన, రామరాజభూషణుఁడు, అధునికులలో కట్టమంచి, విశ్వనాథ, రాళ్లపల్లి పేరెన్నికగన్నవారు.

విమర్శకుఁ డనగా కావ్యగత శబ్దజాలమును భావ యొక్క శక్తి, సంప్రదాయములను బట్టియు రచయిత యొక్క శిల్పమును బట్టియు చతురస్రముగా ఆ గ్రంథము యొక్క పరమార్థమును విశదముగా వివరించు ఒకానొక ఆదర్శపాఠకుడు. "The qualifications of a good critic are three, he must be an adept at experiencing, without ecentri citics the states of mind revelant to the work of art he is judging. Secondly, he must be able to distinguish experiences from one another as regards their less superficial features. Thirdly, he must be a sound judge of values' అంటాడు ఐ. ఎ. రిచర్డ్స తన 'Principles of literary criticism' అన్న గ్రంథంలో. రాళ్లపల్లి విమర్శలు పై పంక్తులకు భాష్యము లని చెప్పవచ్చు. సందర్భవశాన ఆయనే పేర్కొన్నట్లు ఆయన దృష్టిలో విమర్శకత్వము గూటి కవిత్వము వంటిదే. అంతే కాదు విమర్శను ఒక శాస్త్రంగా రాళ్లపల్లి భావించలేదు. ఈకోణంనుంచే వారు విమర్శలు చేసేవారు. 'Every criticism is an autobiography' అన్న పలుకులు వారి విమర్శపట్ల ప్రత్యక్షర సత్యము లని వారే వక్కాణించిరి.

(సశేషం)

# నవలా సాహిత్యము - శ్రీమతి రంగనాయకమ్మ (1947 - 77)

— కుమారి తుర్లపాటి రాజేశ్వరి.



( గతసంచిక తరువాయి )

వ్యభిచార నిర్మూలన మనెడిది రచయిత్రి కృష్ణవేణి (రచనాకాలం 1958) నాటికే సమస్యగా గుర్తించిరి. కాని ఆనాడు వ్యభిచారిణుల పట్ల సానుభూతి ప్రకటించలేదు. కేవలము భార్యాభర్తల వివాహబంధం అపవిత్రము కారాదని మాత్రమే అనిరి. 1972 'అంధకారంలో' నవలలో వ్యభిచారిణుల జీవితము కడు వాస్తవముగా వర్ణింపబడినది. ఇందు పాత రాతియుగం నుంచీ నేటివరకు స్త్రీల చరిత్రను వ్రాయుచూ - స్త్రీలకు సమాజములోనున్న స్థానమును, వారి హక్కులను, వేశ్యలేర్పడిన విధానమును వ్రాసిరి. సోషలిష్టు దేశములలో స్త్రీల స్థితి ఉన్నతముగా ఉన్నదనియు రాధ, రాజేశ్వరి, దుర్గ మున్నగువారి జీవితములను కరుణారసభరితముగా చిత్రించుచు సోషలిజము వచ్చిన స్త్రీల స్థితి తప్పక మెరుగవుతుందనెడి ఆశాభావమును వ్యక్తపఱచిరి.

సోషలిజంలో సామాజిక పరివర్తన కూడా అద్భుతంగా జరుగుతుంది. స్త్రీ అను స్వతంత్ర వ్యక్తులుగా సమాజం గుర్తిస్తుంది. సమాజంలో స్త్రీలు చదువుకుంటారు. వుద్యోగాలు చేస్తారు. తమని తాము పోషించుకుంటారు. ముఖ్యంగా పిల్లల్ని కని పెంచటానికి స్త్రీలు ఎవరి దయమీదా ఆధారపడక్కర్లేదు. అన్నిటికీ ప్రభుత్వం బాధ్యత తీసుకుంటుంది' (పుట - 338 - అంధకారంలో)

నేడను సమాజములో స్త్రీలు చదువుకొని ఉద్యోగములు చేయుచున్నారు. సమాజములో నూటికి 85 మంది స్త్రీలు తమ పిల్లల్ని పెంచటకు ఎవరి దయ మీదను ఆధారపడుటలేదు. భారతీయ వైవాహిక జీవితము భార్యాభర్తలలో ఒకరి యెడల ఒకరికి అనురాగము పెంపొందునట్లు రూపొందించబడినది. ఇందు దయాధర్మముల ప్రసక్తి లేదు. భార్యాభర్తలు పరస్పర సహకారములో, సహజీవనము సాగించుచు పిల్లలను పెంచి పెద్ద చేయుచున్నారు. అయితే ఎక్కడో నూటికి 15 మంది స్త్రీలు పురుషదౌష్ట్యానికి బలిఅయినవారు లేకపోలేదు. వారికి స్త్రీ హక్కులు రక్షణ సోషలిస్టు సమాజము కల్పిస్తుందట! ఏది ఏమైనా రచయిత్రి దేశపాలకవర్గములో రాజకీయ సంబంధమైన మార్పు కోరుతున్నా రని స్పష్టమవుతున్నది. సృష్టి అంతయు సమానమనెడి రచయిత్రి సమాన హక్కులు స్త్రీలకు ఉండవలెనని రని వేరుగా చెప్ప నక్కరలేదు.

'స్త్రీల స్వేచ్ఛ, పురోభివృద్ధి' పురుషులు పెట్టిన హద్దులలో మాత్రమే ఆగేది కాదు. హక్కుల నేవి ప్రార్థించి, యాచించి తెచ్చుకు నేవి కావు. వీరోచితంగా పోరాడి తెచ్చుకు నేవి. ఈ పోరాటంలో నాజీవితాన్ని సంతోషంగా బలిచేస్తాను. స్త్రీని ఆదరించటం అభిమానించటం చాలదు. పరిపూర్ణమైన వ్యక్తిగా గుర్తించాలి (పుట-311) లలిత శేఖర్‌కి వ్రాసిన ఉత్తరం అంధకారంలో)

స్త్రీలపై పురుషాధికారమును రచయిత్రి తమ అనేక - నవలలలో గర్హించారు. ముఖ్యముగా స్వీట్ హోమ్‌లో విమల చేత శ్యామలరావును అనిపించిన మాటలలో రచయిత్రికి స్త్రీలపైనున్న స్త్రీ సానుభూతి ప్రకటితమగుచున్నది.

'స్త్రీ' మీద పెత్తనానికి బయల్దేరారా మీరు? ఏహక్కుతో? ఏ అధికారంతో? ఏ నీతితో? స్వార్థంతో తప్ప - నైచ్యంతో తప్ప - పశుబలంతో తప్ప - మీకంత మెంటల్ లెవల్ వుంటే విశాలంగా ఆలోచించి వదిలెయ్యండి స్త్రీలని... మీ అంతులకి పెత్తనాలకి - మీ దొంగ నీతులున్న పవిత్రగ్రంథాలకీ దూరంగా చూస్తారు స్త్రీ సహజరూపం' (పుట 158. స్వీట్ హోమ్) నేటి సమాజములో యువతీ యువకులలో అంకురించెడి ప్రేమవిధానము కృష్ణవేణి మాధవ్ లమధ్య చూడవచ్చును. బస్సులలో పరిచయములు, పార్కులలో స్నేహములు, అపరిపక్వ స్థితులలో నున్న ఆలోచనలు కృష్ణవేణి నవలలో చూపబడినవి.

సమాజములో స్వార్థ మెట్లు వ్యాపించి యున్నదో 'కూలిన గోడలు' నవలలో విశ్వనాథం, పార్వతి, సావిత్రి పాత్రల ద్వారా నిరూపితము.

'స్త్రీ'లో పార్వతి నిస్వార్థపరాయణత్వమునకు రూపకల్పన. రుక్మిణివంటి చెల్లెండ్రు సూర్యంవంటి సోదరులు సమాజములో ప్రతివ్యక్తిలో నుండెడి స్వార్థమునకు ప్రతీకలు. శరవేగముతో పురోగమించుచున్న సమాజములో స్త్రీలలో వచ్చుచున్న చైతన్యమునకును, వ్యక్తిత్వమునకును చక్కటి సజీవకల్పన 'స్త్రీ'లో

పద్మజ, 'రచయిత్రి' లో విజయ సంప్రదాయమునకు అనురాగమునకు జరగిన సంఘర్షణలో నలిగిపోయిన విశిష్ట పాత్ర 'స్త్రీ'లో ఈశ్వర సోమయాజి. అంధకారంలో' పాత్రలన్నియు సమాజములో కానవచ్చెడి పాత్రలే. ఈనవలలో పెద్దిరాజు భార్యని సుఖపెట్టక పరాయిస్త్రీలతో తిరిగెడి మగవారికొక ఉదాహరణ. పెద్దిరాజు భార్య మహాలక్ష్మమ్మ సెక్స్‌జ్ఞానంలేని అమాయికరాలైన భారతీయస్త్రీ. పెద్దిరాజు రసికుడయినను భార్యను తన కనుకూలముగా మార్చుకొనుటకు యత్నించలేదు. బిడ్డలోవున్న రాధను ఉంపుడు గత్తెగా తెచ్చుకొని సుఖము లనుభవింప సాగినాడు. మహాలక్ష్మమ్మకు మరోదారి కాన్పింపక విరక్తిలో, భక్తిలో పడినది. కొన్ని సంవత్సరములకు రాధ మరణించినది. పెద్దిరాజు ఈడేరిన రాధకూతురు రాజేశ్వరిని లొంగతీసుకొన్నాడు. రాజేశ్వరి అతని అమానుషత్వమును, అతడుచూపిన పెండ్లికొడుకును కాదని లోకములోని కడుగుపెట్టినది. లోకములో ఒకఅమాయికపు టాడపిల్ల ప్రపంచంలోకి ఒంటరిగా వచ్చిన ఆదరించెడి స్థితిలోలేదు. ఈనగ్న సత్యమును అద్దముపట్టిన నవల 'అంధకారంలో.'

సంస్కరణ ప్రియత్వము :

ఈరచయిత్రి అభ్యుదయవాదిని. సంస్కరణాభిలాష కలవా రనుటలోవిప్రతిపత్తిలేదు.

వర్ణవ్యవస్థపట్ల ఈ రచయిత్రికి ప్రారంభమునుండి నమ్మకము లేదు.

'ఈ ప్రకృతిలో సర్వజీవులూ సమానులు. మానవుడిగా పుట్టావు. మానవుడిగానే జీవించు. మానవుడిగానే మరణించు.' (పేక మేడలు. పుట - 178) అనెడి రచయిత్రి వర్ణాంతర వివాహములపట్ల తమ అభిప్రాయములను ఈవిధముగా స్పష్టము చేసినారు

'కులవృత్తులేలేని ఈ రోజులలో వర్ణ వివాహాల అవసరం ఏమిటి? ఈనాడు రాచకన్య వైశ్యకుటుంబములో రాణించక పోతుందా? సంసారజీవనంలో బిడ్డల పెంపకంలో ప్రజలంతా పాటించే ఏకసూత్రం పాటించలేకపోతుందా?' కృష్ణవేణి పుట-56) - అని సమాజమును ప్రశ్నించిన సంస్కరణవాదిని.

'బలిపీఠం' 'స్త్రీ' 'ఇదేనాన్యాయం' 'ప్రేమప్రేమను ప్రేమిస్తుంది' నవలలలో సంస్కరణవంతమైన వివాహములు చేసి అందలి కష్టసుఖములను కూలంకషముగా చర్చించిరి.

'బలిపీఠం' నవలలో నాయకి అరుణ బాలవితంతువు. నాయకుడు భాస్కరరావు హరిజనుడు. వివాహమైన పిదప అరుణలో కులభావం మొలకలెత్తి మహావృక్షమై ఆమెను నిలువునా ఊపివేసినది. తొందరపాటు మనస్తత్వముగల అరుణ భాస్కరరావు శీలమునుగూడ శంకించినదై కోర్టుకెక్కి అనేక అగచాట్లు పడి కడకు భాస్కరరావుచేతిలో మరణించినది. ఈనవలలో అరుణపాత్ర నిట్లు చిత్రించి ముగించుట కులాంతర వివాహము లిట్లు విఫలమగు నని నిరసించుటకాదు. పాత్రల మనస్స్వభావములను వాస్తవముగా చిత్రించుట జరగినది. హృదయ వైశాల్యములేని సంస్కరణ వివాహములు విఫలమగు నని సందేశమిచ్చుటయే ప్రధానాశయము.

ఈ నవలయందే అమల జేమ్సును వివాహమాడి కులభేదములను మరచి సంసారమును స్వర్గతుల్య మొనర్చుకొనినది. మతాంతర వివాహము జయప్రదమైనదనుటకు అమలా జేమ్సుల అన్యోన్య దాంపత్యజీవన మొక ఉదాహరణము. 'స్త్రీ' నవలలో పద్మజ, జార్జివిలియమ్స్ అను ఆంగ్లో ఇండియన్‌ను వివాహమాడి, సుఖముగా జీవించినది. 'ఇదేనాన్యాయం'లో శంకరము వితంతు వగు మాలతిని వివాహమాడి ఆమె జీవితములో వెన్నెల కురిపించెను 'ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది' నవలలో ప్రేమించి కులాంతర వివాహము చేసికొనిన పద్మావతీ, వెంకట్రావులలో కులభేదము తలయెత్తుచుండును. పద్మావతికి తాను బ్రాహ్మణస్త్రీ యనిగర్వము, వెంకట్రావునకు తాను తక్కువ కులమువాడైనను బ్రాహ్మణకులములో కలిసినందున గర్వము. కుల సంబంధమైన అభిప్రాయ భేదములుకల వీరిరువురి దాంపత్య జీవనము కలహములతో నడచుచుండును. కులాంతర మతాంతర వివాహములు సమాజ మంతటను జయప్రదవగట లేదని నిశ్చితార్థము.

ఈ రచయిత్రికి సంఘసేవా ప్రియత్వము కలదని చెప్పుటకు 'బలిపీఠం' లోని కరుణ సమాజవర్ణన, సంఘసేవా కార్యక్రమములు వర్ణించిన తీరు చెప్పక చెప్పును. రచయిత్రి నవలలో విజయ మహిళా సమాజ కార్యదర్శినికి మహిళల కుపయోగ కరమగు సేవా కార్యక్రమములను సూచించి చేపట్టు డని సలహా ఇచ్చినది.

నవలా నిర్వహణయందు లోటుపాట్లు' శ్రీమతి రంగనాయకమ్మ రచనలలలో నధిక శాతము ఒక లక్ష్య సాధనతో కూడు కొన్నట్టివి. ఈమె నవలలో ప్రతి సన్నివేశమూ - సంఘటనా ప్రధానాశయమును స్పష్టముగా ప్రతిపాదించుటకే తోడ్పడు చుండును. 'రచయిత్రి' నవలలో స్త్రీ రచయిత్రి అయి పేరు ప్రఖ్యాతులు లార్జించు కొనుచుండగా - ఆమెభర్త తాను తక్కువ వాడను భావముతో ప్రవర్తించిన తీరు - దాని వలన ఉత్పన్నమగు సమస్యలు విజయ-మోహన్ పాత్రల మూలమున శ్రీమతి రంగనాయకమ్మ చర్చించిరి. విజయ-మోహన్ పాత్రలు ఆద్యంతము ఒకే విధముగా పోషింపబడి రచయిత్రి లక్ష్యమునకు పరిపుష్టిని చేకూర్చినవి.

కృష్ణవేణి నవలలో పాత్ర చిత్రణలలో లోప మున్నది. బి.ఇ. చదువుకొని ఇంజనీరుగా వున్న మాధవ్ లోకజ్ఞాన ముండవలసిన వ్యక్తి. సాంఘిక ధర్మముల ననుసరించినచో వివాహితుడైన మాధవ్ కృష్ణవేణితో ఉత్తర ప్రత్యుత్తరములు సాగించుటయే తప్పు. అతడికి ఆమెను నిజముగా పెళ్ళిచేసుకొనవలె ననెడి అభిప్రాయము ఉన్నట్లైన అరుణనుండి విడాకులు పొంది కృష్ణవేణిని నలుగురిలో వివాహము చేసుకొని ఉండవలసినది.

కానీ మాధవ్ కు అరుణ హక్కులను గురించి, సాంఘిక ధర్మములను గురించి ఆలోచనయే రాలేదు. ఇక కృష్ణవేణి మాధవ్ వివాహితుడని తెలిసిన పిమ్మటను అతడితో ఉత్తర ప్రత్యుత్తరములు సాగించినది. ఇట్టి నీతిబాహ్యమైన పాత్రలను సృష్టించుట వలన సమాజమునకు కలుగు ప్రయోజన మేమియు నుండదు. కృష్ణవేణి అతడికి ఉత్తరములు వ్రాసి వ్రాసి వివాహ ప్రసక్తి తలయెత్తినపుడు కాంత సలహా ననుసరించి అతడితో వెళ్ళలేదు. ఈ సందర్భములో కృష్ణవేణీ-మాధవుల ప్రేమను గూర్చి చర్చింపవలసియున్నది మాధవ్ కృష్ణవేణిని గాఢముగా ప్రేమించినట్లైన అరుణకు విడాకు లిచ్చి - కృష్ణవేణిని వివాహ మాడుటకు కాయశక్తులా ప్రయత్నించి యుండెడివాడు. అదేవిధముగా కృష్ణవేణి మాధవ్ ని ప్రేమించి ఉన్నట్లైతే బొత్తిగా తనకు తెలియని అరుణ కొఱకై మాధవ్ ను నిరాకరించెడిది కాదు. శ్యామసుందర్ ను కాదని, మాధవ్ సలహా ప్రకారము చదువు సాగించుచు మాధవ్ విడాకులు పొందిన పిమ్మట అతడిని వివాహము చేసుకొని ఉండెడిది. ఈ నవలలో కృష్ణవేణీ మాధవులది యువతీ యువకుల నడుమ ఏర్పడిన భౌతికాకర్షణ మాత్రమే. ఈ భౌతికాకర్షణ పరిధి దాటి మానసిక సంయోగమునకు దారి తీసెడి పవిత్ర ప్రేమ వారిరువురి మధ్య శూన్యము.

'బలిపీఠం' నవలలో బర్మా యుద్ధ సంఘటనలు అచటినుంచి భారతీయులు మనదేశమునకు వచ్చినపుడు పడినపాట్లు నవల పొడిగించుటకే కల్పింపబడినట్లు తోచును.

ఈమె వెలిబుచ్చిన ఈ అభిప్రాయము పరిశీలనార్హము. సాహిత్యమనగా ఈ రచయిత్రి దృష్టిలో 'దాని కాలందాటి పోయిన తర్వాత నశించాలి. అంటే దానికి ప్రజలమీద వుండే ప్రభావం తగ్గాలి. అది చరిత్ర ఋజువుగా మాత్రం నిలవాలి' (పుట . స్వీట్ హోమ్) విశ్వజనీనతను ఒక ఉత్తమకావ్య లక్షణముగా ప్రాక్పశ్చిమ విమర్శకు లెల్లరు వివరించియున్నారు. ఆధునిక సాహిత్యములో ముఖ్యముగా అభ్యుదయ సాహిత్యములో కూడా పదికాలాల పాటు నిలువగలిగే ఉత్తమ గ్రంథా లనేకము లున్నవి. శ్రీ.శ్రీ. తిలక్ వంటివారు చిరకాల ముండగలరని పండిత విమర్శకుల యూహ. కన్యాశుల్కమునకు కాలం దాటి చాలా కాలమైనను చిరస్మరణీయముగానే నిలిచినది. ఈ సందర్భముగా ఒక విషయము వివరించవలసి వున్నది. కొన్ని సమస్యలు తాత్కాలికములు. కొన్ని సమస్యలు సర్వకాలీనములు. కొన్ని మనస్తత్వ విశ్లేషణమునకైనవి. ఇందు శాకుంతలాది కావ్యములు, రామాయణ భారతాదులు ద్వితీయ తృతీయ భాగములకు చెందినట్టివి. కేవల తాత్కాలిక సమస్యా పరిష్కార ప్రయోజనోద్దిష్టమైన కావ్యములు కూడ రచనాశిల్పముచే శాశ్వతములు కాగలవు. శిల్ప రహితములై, కేవల తాత్కాలిక సమస్యా పరిష్కార సూచకములు మాత్రమే యగుచో అవి వార్తాపత్రికల కోవకు చెందును.

శ్రీమతి రంగనాయకమ్మ తన నవలల ద్వారా సమాజములో ఈ క్రింది మార్పులు కోరుచున్నట్లు స్పష్టమగుచున్నది.

1. స్త్రీకి స్వతంత్ర జీవనము.

2. స్త్రీ పురుషులకు లైంగిక సంబంధమైన స్వేచ్ఛ.

3. దేశములో పాలకవర్గము నందు మార్పు.

నిశితమైన పరిశీలనాశక్తికి భావతీవ్రతను జోడించి స్త్రీ సమస్యలను చర్చించిన వారిలో ఒకరీమె. ఈమె అన్ని భావములతో మనము ఏకీభవించినను, ఏకీభవించలేకపోయినను శ్రీమతి రంగనాయకమ్మ నవలా రచనలో ఒక స్పష్టమైన బాణీని సాధించిరని చెప్పక తప్పదు.

(డాక్టర్ పి. వీరేశలింగంగారి పర్యవేక్షణమున నేను వ్రాసిన 'స్వాతంత్ర్యానంతర తెలుగునవల' [1947-77] సిద్ధాంత వ్యాసమునందలి కొన్ని పుటలకు సంక్షిప్తీకరణము)

—...—

మార్గపద్ధతి — ఆధునిక రచయితలు .

# శ్రీ నాథుఁడు

— డా॥ అయ్యగారి నరసింహమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.

( గతసంచిక తరువాయి )

ఇంత వఱకు కవితా వ్యవసాయం చేసిన శ్రీనాథుడు బొడ్డుపల్లెలోని ఒక మిత్రుని సహకారంతో సేద్యాన్ని చేసి పొట్టపోసుకోడాని కుద్యమించినాడు. 'కవిత నాంధ్రులో పండించు కరము తోన కాయధాన్యములను పండించాడు. కృషిఫలితమా అన్నట్లు కాయధాన్యాలు పొల్లుగ పండాయి. అయితే నేమి? చేతి కందివస్తుందనుకున్న పంట కాస్తా ప్రకృతి వైపరీత్యంచేత చేజారి పోయింది. కాలం కలిసిరానపుడు కాడే పామై కరుస్తుం దంటారు ఇదే కాబోలు. ప్రకృతి విజృంభణ చూడండి.

సృష్టిచివరలందు చెలరేగి పెనుగాలి
   విశ్వమంతఁ జూపి విసరుచుండ
ఆకాశమావల అన్నిమూలలనుండి
   కాలమేఘపటలి కదలిక్రమ్మ
నుద్వేగమున వ్రాలి యుత్తల విద్యుత్తు
   క్షితిజమ్మునతుకులో జిక్కి ద్రెళ్ళ
అవిరిపొగ గ్రక్కి యవని యంచులుముంచి
   ఆవేళ ఖరవర్షమార్చి కురియ
పండినోటికందిన పెనుపంట నంత
వఱద మదమునఁ బేర్రేగి పాడుచేసె
క్రిందుమీదును గానక కృష్ణవేణి...219

ఆంధ్రుల మనస్తత్వాన్ని ఒడ్డె ప్రభువులు చక్కగా ఆకళింపు చేసుకున్నారు. ఆ ఆకళింపులో నిసుమంత యైన అతిశయోక్తి లేదు. తలను బింకము గల కవీంద్రుని నుండి పన్నువసూలు చేయనిదే వదలవద్దని అధికారులకు అవనీశుడు ఆజ్ఞనుజారీచేస్తూ వారితో ఆంధ్రజాతి తీరు తెన్నులను గూర్చి సవివరంగా చెప్పాడు. ఆవిషయాలెంత యథార్థాలో ఈ పద్యాల వలన మనము తెలుసుకో వచ్చును.

... ఒడ్డెరాజు విక
   టాకృతి జెందుచు నాజ్ఞచేసెనూ
దిడిటవు గల్గు వీరునకుఁ
   దీక్ష్ణ దురీక్షణ మానఁజూచి, చూ
డు దలను బింకమున్నకవి,
   లోఁగడి తత్త్వములేదు వానికా
ముదుకనుడించి సుంకమును
   పూర్తిగఁ గైకొని, యప్పుడీడుమా!
227

అంకెకురాకయున్న వెను
   కాడక వానినిఁ బట్టి కట్టి మా
సుంకములాగి కొమ్మటులు
   చొప్పడకుండిన రాచబాటలో
లంకెలు వేయు మీజనత
   రాదు, పదంపడి యాదుకోదు త
చ్ఛంక రవంత లేదదియ
   సత్యము! సర్వముచేసి చెప్పుమా! 228

ప్రాజ్ఞులు కొంతమంది మది
   బాధను జెందినఁ జెందవచ్చు నా
యాజ్ఞకుఁ జింతఁ జెంది పిడు
   గాగునె ఛత్రమునడ్డు పెట్టినన్
అజ్ఞులె యెక్కుడుండిరి, భ
   యంబెపుడుండెను వారివల్ల నీ
విజ్ఞత తోడ నక్కవిని
   పిండుము చూడకు ముందు
      వెన్కలన్. 229

సేమిడు నట్టియాజ్ఞ విను
   మిక్కుటమైన రహస్య మీవు లో
నోముము మాదుమంత్రులుం బ్ర
   జోఘము ముందఱ, పన్నులన్ని యున్
ప్రామితి మించఁ జెప్పపలు
   బాసలు చేయుచునుండి రద్ది నీ
వేమఱి తేని, బైటపడు
   నెల్లను నేర్పుగ సంచరింపుమా. 230

ఏమటు చెప్పుచుందు మిఁక
   నీవిటు చేయుచునుండు మాంధ్రులిం
తేమియు లోతుపాతులు గ్ర
   హింపఁగఁ జాలని మంచివారు మా
చే, మెయి దువ్వినన్ గునుకు
   చెందుచుఁ గొమ్ములం వాల్చుగోవు శ్రీ
భూమిని నిచ్చిదిట్టి రెటు
   పోల్తురు మావగు రాజకీయముల్.
231

భూనాథుని యాజ్ఞ మేరకు అధికారులు శ్రీనాథుని బంధించారు. ఈ సందర్భంలో గ్రంథకర్త చెప్పిన యీ విషయం గమనించండి.

ఊరఁ దెనుఁగు సొమ్ము లొంటఁబట్టినజేడ
   తెనుఁగు జాతికవిని నణచు టేమి
పిల్లనమ్మి విటుడు తల్లినింటను బెట్టి
   అద్దమైన ఆంధ్రకడ్డ పగులు   23

దీనివల్ల ఈగ్రంథకర్తకు దేశంమీద, భాషమీద, ప్రజలమీద గల మమకారం ఎటువంటిదో మనమూహించు కోవచ్చును.

ఆనేతలు శారదా మూర్తియైన శ్రీనాథుని బాధించిన తీరు చూస్తే యినుప గుండెలైనా పగిలి పోతాయుంటారు. ఆపద్యం చూడండి.

మెడచుట్టు బిగబెట్టి మెదలకుండగఁ జేయ
  బొగడదండ కొనల పోటు కొదిగి
భుజమంత బరువెక్క భూమికి దిగలాగు
  నల్లగుండును మోసి యల్లనాపి
అల్లాడి మైతూల నంఘ్రుల జతనుంచు
  నిగళియుగళి కట్టైనిలచి యుండి
కరముల గోడించి కదలకుండగ నిల్పు
  వెదురు గొడియ పట్టుకదలకోర్చి
చెమట దుమ్ముతో మోముపై చెమటికారి
కనులలో దిగుచుండగా గొనలనుండి
చేయునదిలేక నిలిచెను చేష్ట నుడిగి
యినుప గుండెలైన పగులు కనిన యంత. 261

చరమ ఘటికలో నాతనిస్థితి యిలాఉంది.

నాలుక యిగురెండి నలుపారి పోవుచు
  చల్లని నీటికై సాగుచుండ
అవని కాలుచునుండ నఱకాళ్ళతోఁద్రొక్కి
  పచ్చికరుపులౌచు పైకిఁదోప
గుండెల నెఱియలన్ మండెడి నెత్తురు
  నావిరై కనుగ్రుడ్ల నావరింప
భుజసీమ పట్లూడి భూమికి వ్రేలాడ
  ప్రాణమ్ము కడగొట్టి పరుగులిడగ
భీకరతర బాధావిల వృద్ధహీన
కీకస కళేబరాంతర కీలిత, లవ
  బలమల్ల క్షీణించి లీనమౌచు
  న్యమునకు జారి నశించె సుకవితెలివి.
283

శ్రీనాథుని ప్రాణాలు పంచ భూతాలలో కలిసిపోయాయి. ఆ నిర్జీవమైన ఆకృతి కూడ నమ్రభావంతో కాల కంధరుని ప్రార్థిస్తున్నట్లుగ ఉందిట. మహేశ్వరారాధన ధ్యానైక శీలుడుగదా! శ్రీనాథుడు జీవి యెంతటిదైనా అనంత శక్తికి దాసోహమనక తప్పదుగదా మరి!

పాణియుగళమ్ము జతచేరి బంధమందు
నున్న శ్రీనాథు శవమును గన్నయంత
ప్రాణములు పోయినను గూడ వంగి యార్ద్ర
కాల కంధరుఁ బ్రార్థించు కరణితోచు.
285

శ్రీనాథకవి సార్వభౌముని నిర్యాణ వార్తను విని ఆకాశాంతకూడ కడలి యంత కన్నీరు కార్చిందట.

ఒక కవిసార్వభౌముడు మ
  హోగ్రవిషాద విలాస పాత్రనే
టికిఁ దుదియంక మవ్విధిన
  టించి సమాప్తముచేసి నిల్వ భూ
మికిఁ గల ధ్వాంత పుండెరలు
  మెల్లగఁ జాఱెను బచ్చిమంబునన్
మొకమును వంచి యేడ్చెడిశ
  బోరున,సంద్రమె యశ్రుధారలై. 288

ఈవిధంగా 288 పద్యములుగల ఈ 'శ్రీనాథ' కావ్యంలో ప్రతిపద్యం పాఠకుల హృదయాలలో స్థావరాన్ని ఏర్పఱచుకుంటుంది. ఎన్ని పద్యాలు ఇక్కడ చెప్పినా అదిఅసమగ్రమేయౌతుంది. ప్రతియొక్కరు చదివి తదనుభూతిని పొంది ఆనందింప దగిన కావ్యరాజ మిది.

సందర్భానుసారంగా అలంకారాలను ప్రయోగించుటలో నీయనకు గల నేర్పు బహుధా ప్రశంసనీయము. మచ్చునకు రెండు పద్యాలు.

గట్టులు కోతకోయుచు వి
  కారవిలోల విశాల వీచికల్
చెట్టుల మాలికెక్క నతి
  శీఘ్రగతిన్ జను కృష్ణవేణియా
పట్టులఁ బంట చేలపయి
  వాల్చుఁ గుదృక్కుల నప్పుడప్పుడున్
గట్టిడి భోగకాంత కల
  కాంతను త్రుళ్ళుగఁ జూచు కైవడిన్.
210

ఆంధ్ర జగతీ సుజన నయనాళి శయన
మంచు శ్రీనాథ కవినిఁ బన్నడుగ వచ్చి
రవని పాలకు నధికారు లావరించి
ఖరములు సుమకాద్వలిమీదఁ బొరలుపగిది
224

అన్యదేశ్యాలు శ్రీనాథునినుండి సాహిత్యంలో విరివిగా వాడటం జరిగింది. అందుచేతనోయేమో ఈకావ్యంలో బజారు, బేజారు, పోకు, జాలుము, ఖుషీ చేయుటు, మోజా, పోగు మొదలైన పదాలతో పాటు వెనుకటి సాహిత్యంలో కనవచ్చే పదాలనుగూడ వీరీసందర్భంలో సమయోచితంగా వాడటం గమనింపదగినది. విజయమ్ముచేయు, దీనారము, దివాణము, సుమాళము మొదలైనవి.

సందర్భోచితంగా పదప్రయోగం చేయుటంలో వీరికి మంచినైపుణ్యం ఉంది. ఈ ఉదాహరణ చూడండి.

ధీరధారా హృదయదయాదీప్త దివ్య
  విదుదు వీరభద్రారెడ్డి వీక్షణములు
వెలుగులానుచు కవిరాజు మెలగుచుండె
  మెఱుపులకు విష్ణుపదమంత మెఱసి
    నట్లు. 3

ఇట విష్ణుపద శబ్దం ప్రకరణోచితము.

ఇందు లోకోక్తులు, పలుకుబడులు తగినన్ని ఉన్నాయి.

గంధకుసుమము పురుగులు పట్టు (257) ఈబ్రతుకికై తెల్లవారును (255) సుకవితజతగద పెరకున్ (188), ప్రభుని బట్టియుందురు ప్రజలుకూడ (178)

పోరాయెడి రోజులుకావె (202), పిల్లనమ్మి విటుడు తల్లినింటబెట్టు (234) పిడుగాగునె ఛత్రము నడ్డుపెట్టిన, (229), జీవి చనిపోయిన లోకులగోల కాటికే (146) నాలుక కదిపె నోరూరి (215), కాకులు చుట్టుముట్టి దడిగట్టుచు కూతలు కూయు, మోడున బొగ్గులై మొగ్గ లుండునే (45) ఎండినవవ్వు (194) నేలను బూడెను (32)

తెలుగు గ్రంథములలో ముద్రారాక్షసాలు సర్వసాధారణం. ఇందులోను వానిని గమనింప వచ్చును. 6 వ పద్యం రెండవ పంక్తిలో జ్ఞానఖనులై యోమురు జనులు ముందు రెండవగణానికి మరొక లఘువు కావలెను. అటులనే 'లేచినిలుచున్' అన్నపుడు 'చు' వర్ణం లోపించింది (25)

గ్రంథాంతమందు కొన్ని పదములకు అర్థాలీయబడ్డాయి. అయినా ఇంకా కొన్ని పదాలకు అర్థాలు కొన్ని పంక్తులకు వ్యాఖ్యానం పాఠకుల కందించాలి.

మళయాళ వచనాల మదుగంత గదలించు (86), సీసపద్యం 93 లో మొదటి రెండు పాదాలు, గళదామోద్గారనిర్వారి సాఖోన్మోదంబుగ (110), స్రోస్రవరీ (28), దడదండము (57) నవ్యనాద తపస్వి (84)

ఈకావ్యంలో మొత్తం ఎనిమిది ప్రకరణాలున్నాయి. ఒక్కొక్క ప్రకరణానికి ఒక్కొక్క పేరు పెట్టి ఉన్నట్లయితే మరింత నిండుగా ఉండేది. వీరీ కావ్యాన్ని ప్రకరణాష్టకంగా విభజించుకోవడంలో ఒక విశేషం గోచరిస్తోంది. కావ్యము పరమేశ్వరాకృతి. అయ్యది అష్టమూర్త్యాత్మకము. అది రసానంద తుందిలము. తాదృశమైన కావ్యమును (సం) భావించి సర్వాత్మనా తన్మయుడైన సహృదయునిచే వ్యక్తీకరింపబడిన రసోద్గారమున అష్టమూర్తులనుబింబితములగుటయు నీప్సితార్థసిద్ధికొఱకే.

ఈకావ్యంలో అనేక నిత్యసత్యాలున్నాయి.

కనక కంకణమ్ములు కల్గుకరమె యైన
దివ్యమృష్టాన్న మలరారఁ దినఁగ నబ్బు
బోడికరమైన దానికి ముష్టితిండె
ధర్మశాస్త్రములేమన్న! దత్త్వమిదియె
(162)

'ధనమూలమిదం జగ' త్తనే దానికి వ్యాఖ్యాన ప్రాయమైన దీపద్యం.

'కోటివిద్యలు కూటికొఱకె' అన్న సామెత లోకంలో ఉంది. దాని కుదాహరణ ప్రాయమైనదీ క్రింది పద్యం.

వ్యాస మహామనీషి యటు
లాకవి కొందుకు తల్లడిల్లెనో
గాసిలినేను నేడు పొడ
గంటిని సంశయమింత లేక తా
వ్రాసినశాస్త్రసారముల
భావము లెట్టివియైన నీక్షుధా
త్రాసములోన బాధపడి
స్థానముతప్పడెయెన్ని చెప్పినన్ (174)

జడాజడ ప్రకృతిలో శివరూపమును చూడగలిగిన ధూర్జటి కవిశేఖరుని స్మృతిపథంలోకి తెచ్చేపద్యాలు శంభుదాసుఁడని పేరెన్నికగన్న ఎఱ్ఱన సీసపద్యపు హొయలును ప్రతిఫలింపఁజేసే సీసాలు శ్రీనాథకృతిలో కనబడుతాయి.

మింటికి మంటికున్న పాలి
మేరను శీర్షమునెత్తి నిల్చినా
కంటికి కానిపించు చ్యుత
కాముని జ్ఞాన సమాధిరూపమై
యొంటిగనీలి కొండపయి
నున్నది తెల్లని వల్లెవాటుగా
నంటుచు వాఁచున్న ఝురి
ఆ భవబంధము లేదొ దానికిన్ (63)

మిహిరుని రశ్మికిన్ గరఁగి
మెల్లఁగఁ బాములు వాఱి పాఱియా
తుహిన మహీధ్ర రాగ్రి సిత
తోయములో మననుండి యుండి నీ
దుహానన మొందనో ప్రభువ
తోపవు దాని రహస్య సూక్ష్మముల్.
(266)

కమనీయ కల్హారకళికలాంతరమున
కౌముదీ గీతిక కదలు నూపె
హరితగృహారామ తరుఫలశ్రేణిపైఁ
జంద్రికాసేవధి సంచరించె
సప్తగోదావర జలవీచికాంజలిఁ
జాంద్రీప్రవాహమ్ము జాఱెసాగె
సారణీతట సీమశైల సానువులెత్తి
జ్యోత్స్నాఘుపూరమయూపఁజొచ్చె
పాండురాంశు కాంచల పల్లవాగ్ర రచిత
తారకాచలిత కలితచారు రజని
సంపితాహ్లాద సంప్లుత సౌమ్యయగుచు
స్వచ్ఛకవితగాఁ దడిసె నాస్వాంతమందు
(78)

భూపతులు, మంత్రి మాణిక్యములు, కవీశ్వరులను గౌరవించి సత్కరించిన విధానములు, తమతమ సెలవులు తప్పిన తమ మిత్రులె శత్రులగుట తథ్యము సుమతీ' అన్న సూక్తిలోని ఔచిత్యం ఇత్యాది విశేషాలెన్నో ఈ చిరుపొత్తములో మనకు కానవస్తాయి.

'శ్రీనాథ జీవితచరిత
నానానూనాధిక కరుణరసము విరియన్
జాను తెనుంగు నుడుల చ
ల్లా నరసింహకవి వ్రాసె లాలిత్యమునన్'

అను కవిసార్వభౌమ శ్రీ వేంకట సుబ్బయ్యగారి నుడి సముచితము, రుచిరము.



# 1979-80 బి. వి. అండ్ కో., వారి ప్రచురణములు

## Telugu Five Pandits Notes

### Intermediate

| | | |
|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రు. 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రు. 3 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రు. 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రు. 3 - 00 |

## ENGLISH

| | | |
|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రు. 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రు. 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రు. 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రు. 1 - 50 |

## డిగ్రీ తరగతులు

| | |
|---|---|
| B. Com. II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |
| B. A. II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |
| ప్రతిమ B. Com. II Year నాటకము నోట్సు | రు. 3 - 00 |
| బలరామ విజయము ,, | రు. 3 - 00 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర B.A. II Year నాటకము నోట్సు | రు. 6 - 00 |
| I Year Degree Telugu Notes B. Com. (Prose & Poetry) | రు. 7 - 00 |

** I Year B. A., B. Sc. నోట్సు అతిత్వరలో ప్రచురింపబడును.

For Copies :—

*Publishers :*

**B. V. & CO.,**

6-8-7, Innispeta, RAJAHMUNDRY-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.